## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన

సం

Roopkala

అనురాగంతో ఆదరించి, చందనగంధంలా
చల్లని ప్రశాంతి ప్రసాదించా ల్సిన భర్త
అనుక్షణమూ అగ్నిపర్వతంలా పొగలు చిమ్ముతూ
సెగలు కక్కుతూ వుంటే ఏ స్త్రీ ఐనా అతనితో కలిసి
ఎంతకాలం కాపురం చేయగలుగుతుంది?

పెళ్లి చేసుకొన్న వారూ
పెళ్లి చేసుకోదలచే వారు
అందరూ
పదే పదే చూచి
అదే పనిగా ప్రశంసిస్తూన్న
ఆదర్శ చిత్రం




భరణీ పిక్చర్స్ వారి

# వివాహబంధం

నవయుగ

నిర్మాత, దర్శకుడు: రామకృష్ణ

# ఉత్తరాలు

## దీపావళి పోటీకథలు

6—11—64 తేది దీపావళి సంచికలో ప్రథమ బహుమతి పొందిన 'తెరవెనుక దీపం' అను కథ బాగుగా ఉన్నది. కాని 'ఆ ఉదయం మామూలుగా తిరుపతమ్మ జామి చెట్టెక్కి నిక్కరు జేబులనిండా కాయలు కోసుకొని ఇంట్లో అడుగుపెడుతుంటే పొవడిలో భాస్కరం చదువుకుంటున్నాడు' అని రచయిత వ్రాశారు. పై వాక్యములో కర్త ఏది? తిరుపతమ్మే, కర్త అయితే ఆమె జామి చెట్టెక్కి నిక్కరు జేబులనిండా కాయలు కోసుకోవడమేమిటి?

కెం రంగనాథం (రాపూరు)

* * *

ఆంధ్రపత్రిక నిర్వహించిన దీపావళి కథల పోటీలో "తెరవెనుక దీపం" మొదటి బహుమతి నిస్సందేహముగా పొందదగ్గదే. బాహ్య ప్రపంచమునకు కానరా మానసిక వ్యధను రచయిత అతి చక్కగా చదువరులకు చూపగలిగారు. కథలో సహజత్వము అడుగడుగున కన్పిస్తున్నది. ముఖ్యంగా తిరుపతమ్మ "తిట్లు" కథ కొరకు కల్పించినవికావు. ఇవి రచయిత జీవితానుభవమే అయిఉండాలి.

1953 లో తెరమరుగుపడ్డ రచయితను ఈ "తెర వెనుక దీపం" తెరపైకి తెచ్చింది. మరల తెర వెనుకకు పోక, రచయిత ముందు ముందు మంచి రచనలు చెస్తారని ఆశిస్తాను.

హుస్సైన్ (అమలాపురం)

## ఇంటింటి పజ్యాలు

13—11—64 పత్రికలో "ఇంటింటి పజ్యాలు" లో "ఇటువంటి జూదగాణ్ణి ఇంగ్లీషులో అంటారు హంటర్" అని వేశారు. అసలు అది అచ్చు పొరబాటు అనుకుంటాను. "పంటర్" అని ఉండాలి. శ్రీ ఆరుద్ర ఇటువంటి పొరబాటు చెయ్యరని మా నమ్మకం.

మణి, రత్నం, ఆనందు (విశాఖ)

* ముద్రారాక్షసం.

## సైతాన్ చేతుల్లో....

"ఓ డబ్బిన్" స్వానుభవం "నేను సైతాన్ చేతుల్లో బానిసను" అసంపూర్తిగా వదలేసారని నా అనుమానం. ఎందుచేతనంటే 'డబ్బిన్' స్నేహితురాలు పాట్సీ ఏమయింది? ఒక్ స్టెరియన్ యువకుడు మరల సైతాన్ అనుచరులకు చిక్కకుండా ఉన్నాడా? (వాటు సైతాన్ అనుచరులు) రచయిత 'డబ్బిన్' మీద మరల ఏ విధమయిన ప్రతీకార చర్య తీసుకోడానికైనా ప్రయత్నించలేదా? అనే విషయాలు తెలియలేదు.

కొలుకులూరి నారాయణము (భీమవరం)

## అణుబాంబుల తయారీ : కొన్ని అభిప్రాయాలు

చైనా అణ్వస్త్ర పరీక్ష జరిపిన ఈ సమయములో భారతదేశము గూడ అణుబాంబుల తయారీకి పూనుకొనుటకంటే అణ్వస్త్ర పరీక్షలకు వ్యతిరేకముగ ప్రపంచ రాజ్యములనేకపరచి, చైనా చేత గూడా అణ్వస్త్ర పరీక్షలు విరమింపచేయుటకు భారతదేశము కృషి చేయుట ఎంతైనా అవసరము.

శశి (కలకత్తా)

* * *

మీ పత్రికలో సూచించిన విధంగా ఆర్థిక, నైతిక కారణాలవల్ల మనదేశం అణుబాంబులు తయారు చెయరాదు. అప్పుడు దేశ రక్షణకు చేయవలసిన పని—చైన మనమీద ఏ విధమయిన దాడిచేసినా, తక్షణం సహాయం లభించగల ఒడంబడికలను మనం రష్యా, అమెరికాలతో కుదుర్చుకోవాలి. ఆ సహాయం మనం కోరిన కొన్ని గంటలలో మనకందేలాగుండాలి. ఇట్టి ఒడంబడికకు రష్యా సుముఖంగాలేనిపక్షంలో కనీసం అమెరికాతో నయినా మనం ఇట్టి ఒడంబడిక కుదుర్చుకోవడం ఉత్తమం.

సూరెడ్డి మోహనప్రసాద్ (విజయవాడ)

* * *

ఎవరో మనలను శాంతికాములని—అంటున్నారని, ఇపుడు మనము అణ్వస్త్రాలు తయారు చేస్తే ఆ మహా బిరుదు పోతుందేమోనని భయపడరాదు. చైనా తిరిగి దాడిచేస్తే దానిని మనము త్రిప్పికొట్టే స్థితిలో లేకపోయినామంటే అపుడు పై బిరుదుకాని, మనలను శాంతి కాముకులని అన్నవారుకాని అడ్డురాదు. అడ్డురారు. మన ఆర్థికస్థితి ఎట్లాఉన్నా ఈ పరిస్థితులలో ఒకరిని నమ్మడం, ఒకరిమీద ఆధారపడడం అంత మంచి పని కానేకాదు. ఇక్కడ "ఏ దేశానికి దెబ్బవస్తే దానిని తట్టుకొని ప్రతిఘటించే శక్తి నీకు ఉండటమే మంచిద"న్న జనరల్ డిగాల్‌గారి మాటలు ఎంతయినా నిజము.

సుండూరు కొండయ్య (అనంతపురం)

* * *

ఒక్కటే జవాబు : అటంబాంబేకాదు. అసలు ఏ బాంబూ వద్దు. అన్ని బాంబులనూ మన అధ్యాత్మ సిద్ధాంతాలతో, ఆ ధీశక్తితోనే జయించాలి. లేకపోతే ఇది భారతదేశం అవదు. గాంధి, నెహ్రూలు, మే కారణానికి జీవితాల్ని అంకితం చేశారో ఆది పందులకు పూసిన పన్నీరు, కోతులముందు రత్నాలు మాత్ర మౌతాయి. ఆధ్యాత్మిక జీవనమే సుదర్శన చక్రం మన రక్షకు—నమ్మండి.

వై. హెచ్. సూరి (హైదరాబాదు)

## ఇంటింటి పజ్యాలు

ఆరుద్ర

### మై డియర్ ఆత్మా! వై? పుత్రనామాసి?

అమాయకత్వానికి పసిపాపే నిత్యోపమానం
అంటారు గానీ అది నాకు చాలా అనుమానం
నా ఉద్దేశంలో పిల్లలే చాలా గడుసువాళ్లు
నాన్నలూ అమ్మలూ అది గుర్తించని వెర్రివాళ్లు
ఏడ్చి సాధించుకొంటారు పిల్లలు తమ పంతాలు
ఇది నిరూపించడానికున్నాయెన్నో ఉదంతాలు
బుచ్చిపిల్ల కావాలని మారాం చేసే బొమ్మ
ప్రస్తుతమున్న ప్రదేశం అటక
బుద్ధిగా నాన్న పైకెక్కి దాన్ని దింపేదాకా
అమ్మాయి వేయదు తన ఏడ్పులో గుటక
చిన్నవాడి గుక్క తప్పించే మంత్రమనుకొంటున్నారా ఓం హ్రీం.
ఛీ ఛీ ఉన్నదొకటే తారక మంత్రం అది ఐస్ క్రీం
కన్న బాబు గొంతుకలోంచి మ్రోగుతున్న పదివేల రేడియోసెట్లు
కరంటులేనట్లు ఆగిపోతాయి మీరు ఇవ్వగానే చాక్లెట్లు
చిన్న పిల్లలందరూ అబ్బో చాలా ఘటికులు
సినీమాతారల కన్నా ఆరితేరిన నటీనటకులు
అభినయించడం వల్లనే వీళ్ళంతా అమాయకులు
అదే అలవాటైతే వాళ్ళే భావి సత్యాగ్రహ నాయకులు.

# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 27—11—'64
క్రోధినామ సం॥ కార్తికమాస బ॥ నవమి
సంపుటము : 57 సంచిక : 13
స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా రూ. 15.60. ఇతర దేశాలు ఓడమీద (Sea Mail) రూ. 28.60. విమానం ద్వారా (Air Mail) బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు రూ. 120.00. అమెరికా రూ. 176.80. ఆస్ట్రేలియా రూ. 148.20.

విడిప్రతి 30 పై.
సంవత్సర చందా 15.60 పై.
6 మాసాల చందా 7.80 పై.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1




"మన డబ్బులేమే: నిక్షేపంలా వుంటుంది. మనం కాంగ్రెసుకు బోలెడంతా చందా ఇచ్చాంగా. ఇక భయమెందుకు!"

## మనలో మాట

'ఆటంబాంబు సమస్య' మీద చాలా ఉత్తరాలు వస్తున్నాయి! వీలయినంత చిన్నవిగా వ్రాసి పంపమని పాఠకులని కోరుతున్నాము......

* * *

దీపావళి కథల పోటీలో పాల్గొన్న రచయితలు చాలామంది తమ రచనలు 'ఏమయినాయి?' అంటూ ఉత్తరాలు వ్రాస్తున్నారు. పోటీకి ఎన్నో కథలు వచ్చాయి; స్వీకరించని వాటిని నిబంధనల ప్రకారం తిప్పి పంపటం చురుకుగానే జరుగుతున్నప్పటికీ కొంతి ఆలస్యం తప్పదు! రచయితలు ఇది గుర్తించ ప్రార్థన......

* * *

న్యూస్‌ప్రింటు సరఫరా విషయమయి ఇటీవల కొన్ని ఇబ్బందులు కలిగి 'ఆంధ్ర సచిత్ర వారపత్రిక'ని మామూలుగా బజారులో విడుదల చెయ్యలేకపోయాము. తిరిగి పరిస్థితి సరిదిద్దుకొనే సూచనలు కనిపిస్తున్నాయి! పాఠకులకి కలిగిన ఇబ్బందికి చింతిస్తున్నాము......

* * *

'పనివాని కన్నీటి గాథ' వ్యాసం తమకి నచ్చినదంటూ ఎందరో పాఠకులు వ్రాశారు. ఒకరు కొంత డబ్బుకూడా పంపారు! అతికష్టంమీద బూట్‌పాలిష్ కుర్రవానికి అందించాము. ఇకపైన ఇటువంటి మనీ 'కానుక'లు పంపవద్దని పాఠకులను కోరుకుంటున్నాము......

త్వరలో ఈ రకం వ్యాసాలు - బొమ్మలతో సహా-మరి కొన్ని ప్రచురిస్తాము.

## విషయానుక్రమణిక

ముఖచిత్రం : తమిళనటి కుమారి సరస్వతి. (ఫోటో : ప్రభాకర్)

పరిశీలక్

# గుంటూరులో ముగిసిన ఏ. ఐ. సి. సి. సభలు:



సభా వేదికపై కాంగ్రెస్ పెద్దలు: శ్రీయుతులు లాల్‌బహదూర్, నందా, బ్రహ్మానందరెడ్డి, శీలం సిద్ధారెడ్డి, ఎం. ఆర్. అప్పారావులను చూడవచ్చును.

గుంటూరులో జరిగిన ఏ.ఐ.సి.సి. సమావేశాలు గుంటూరు పట్టణం పేరు ప్రతిష్ఠలను పెంచకపోగా, సభా ప్రాంగణంలో నిర్మించిన ప్రకాశం మండపానికి నలువైపులా నిలబెట్టిన ఒంగోలుగిత్తలు కాంగ్రెసు పార్టీ నేటి స్థితిని నిరూపించాయి,

కాంగ్రెసు పార్టీకి ఎన్నికల చిహ్నం కాడికి కట్టిన కోడెద్దులు. ఇది రైతుల గుర్తు అని, కాంగ్రెసు పార్టీ—విజయత్వానికి చిహ్నమని ఆనాటి కాంగ్రెసు కార్యదర్శి శ్రీ కళా వెంకటరావుగారు చెప్పారు. ఎద్దు ఎలా వ్యవసాయంచేసి, రైతుకు పంటలు పండించి ఇస్తుందో, కాంగ్రెసుపార్టీ కూడా ప్రభుత్వంలో ఉండి ప్రజాశ్రేయస్సుకు కృషిచేస్తుం దన్నారు. ఎద్దులకు కాడి కట్టడం వంటిదే కాంగ్రెసు సభ్యులకు ''పార్టీ క్రమశిక్షణ'' అని కూడా అన్నారు.

కాని ఈనాటి కాంగ్రెసుపార్టీకి క్రమశిక్షణ లేదు. ఆ పార్టీలోని సభ్యులు వ్యవసాయంచేసే ఎద్దులవంటివారు కాదు. ఇంకా ''కాడి కట్టని గిత్తలు'' వంటి వారు. అందులోను పోట్లగిత్తలు, కనుకనే ''పొడవడానికి సిద్ధంగా ఉన్న గిత్తల బొమ్మలను'' నెహ్రూ నగర్ మధ్యగా, ఎత్తయిన ప్రకాశం మండపంపైన నలువైపులా ఉంచారు. నాలుగు రోజులు జరిగిన ఏ. ఐ. సి. సి. సభలను ''గిత్తల నందెముల జాతర'' గా మార్చారు.

ఈ సభలలో ముఖ్యమైన అంశం, నాయకు-లను చూడడానికి వచ్చిన ప్రజలు. అందులోను అధిక సంఖ్యాకులు గ్రామీణులు. వచ్చిన ప్రతి వంద మందిలోను ఏ ఒకరిద్దరికో సభా ప్రవేశపు అదృష్టం లభించింది. అది కూడా మూడా అభిమానం. టికట్లబజారులో టిక్కట్టు పొందగల శక్తి కలవారికే దక్కింది. మిగిలినవారంతా పురవీధులలో బారులుతీరి నిలబడి చూడగలిగిన నాయకులను చూచి, తమ కుతూహలాన్ని తీర్చుకున్నారు. నాయకుల పట్ల కుతూహలం ఉండడం ఒక ఎత్తు. వారిని, వారి పార్టీని అభిమానించి వోటు వేయడం మరొక ఎత్తు. ఈ వ్యత్యాసాన్ని గుర్తించక, వచ్చినవారంతా కాంగ్రెసు అభిమానులని భావించడం, ఇదంతా కాంగ్రెసు బలం అని అంచనా వేయడం, అలాంటి ఆలోచన చేసేవారి పొరబాటు కాగలదు. కారణం—ఆ కిందటి ఎన్నికలలో శ్రీ నెహ్రూ బహిరంగ సభలకు ఆంధ్రదేశంలో వచ్చినంత జనం ఎక్కడా రాలేదు. అయినప్పటికీ కాంగ్రెసు అభ్యర్థులకు వచ్చినన్ని తక్కువ వోట్లు ఇంకెక్కడా రాలేదు.

జనాకర్షణ గల వ్యక్తి పండిట్ నెహ్రూ. ఆయన లేకుండా జరిగిన రెండవ ఏ. ఐ. సి. సి. సభ గుంటూరు సభ. నెహ్రూ లేకపోయినా లక్షలమంది జనం తమను చూడడానికి రావడంవల్ల, నేటి కాంగ్రెసు అగ్రనాయకులకు ఆత్మవిశ్వాసం పెరిగింది. తామూ గొప్పవారమనే భావం కొందరిలో కానవచ్చింది. నెహ్రూ లేకపోయినా దేశ నాయకత్వం వహించగల వానే ధోరణి మరి కొందరిలో వినవచ్చింది. ఇందుకు ఉదాహరణగా శ్రీ ఎస్. కె. పాటిల్, సర్దార్ స్వర్ణసింగ్, శ్రీ సి. సుబ్రహ్మణ్యం, శ్రీ కామరాజ్, శ్రీ బ్రహ్మానందరెడ్డి, శ్రీ అతుల్యఘోష్ ప్రభృతులను ఉదాహరించవచ్చు. వీరందరూ సభావేదికపై అగ్రనాయకుల స్థాయిలో ఆసీనులైన రీతి, వినా



విజయవాడ బహిరంగ సభలలో ఒక పోస్టర్లవనంలో కూడిన నగ్ని వేశం.

# ఒక ప్రత్యేక సమీక్ష!

లోచనలు కొనసాగించిన పద్ధతి ఇందుకు విరుద్ధంగా ఉంది.

అందులోను ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు సభావేదికపై నాయకులను పరామర్శించిన పద్ధతి, సభాకార్యక్రమాన్ని గురించి సమాలోచనలు కొనసాగించిన రీతి అందరి మన్ననలుపొందింది. ఆయన అగ్రనాయకులకు తలలో నాలుకగా వున్నారా అనిపించడమే కాదు. అగ్రనాయకుల కోవకు చెందగల లక్షణాలు మెండుగా కలవని ఆ మూడురోజుల సభలలోను నిండుగా నిరూపించుకున్నారు శ్రీ బ్రహ్మానందరెడ్డి.

పూర్వపు రోజుల్లో పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్, మౌలానా ఆజాద్, రాజేంద్రబాబు, డాక్టర్ పట్టాభి, పండిట్ పంత్, డాక్టర్. బి. సి. రాయ్, రవిశంకర్ శుక్లా, ఖాన్ అబ్దుల్ గఫార్‌ఖాన్ వంటి జాతీయ నాయకులు వేదికపై ఆసీనులై ఉన్నప్పుడు కానవచ్చిన దృశ్యానికీ, ఇప్పుడు మూడవతరం నాయకులతో కనిపించిన దృశ్యానికి చాలా తేడా ఉంది. ఆనాటి దృశ్యం కన్నుల పండువుగా ఉండేది. జన్మ తరించినట్టు అనిపించేది. ఒకరకమైన ఆవేశం, భక్తిభావం కలిగించేది. కాని నేటి దృశ్యం ఇందుకు విరుద్ధంగా ఉండడమే కాదు. మెదడుకు మేత పెడుతున్నది. రకరకాల ఆలోచనలను రెచ్చగొడుతున్నది.

అగ్రశ్రేణి నాయకుల తర్వాత, రెండవ తరంలో మొదటి శ్రేణి నాయకులుగా ఉన్న శ్రీయుతులు మొరార్జీ దేశాయ్, జగజీవనరాం, నిజలింగప్ప, దేబర్ ప్రభృతులు వేదికమీద ఉన్నారు. కాని వీరు వెనుకవైపున ఎందుకు ఉంటున్నారు? అధికార తీర్మానాలకు ప్రతిపాదనకుగాని, వానిపై జరిగే చర్చలలో పాల్గొనడానికిగాని వీరెందుకు ముందుకు రావడంలేదు? వీరు అధిష్ఠానవర్గంలో అంతరంగికులు కారా? వీరిని ఇలా అనామకులుగా ఉంచడం కాంగ్రెస్‌పార్టీకి శ్రేయస్కరం కాగలదా? ఇలాంటి విడుముఖం—పెడముఖం పరిస్థితి ఇంకెన్నాళ్లు సాగుతుంది? ఎన్నాళ్ళు సాగదు, అసలు ఈ స్థితి కాంగ్రెసుపార్టీకిగాని, దేశానికిగాని, మంచిదికాదని, గుంటూరు ఏ. ఐ. సి. సి. సభావేదికపై కానవచ్చిన దృశ్యాలు స్పష్టపరిచాయి.

రాష్ట్రం దృష్ట్యా కూడా ఇదే రీతి కానవచ్చింది. వేదికమీద ఆసీనులైనవారిలో మాజీ—కాంగ్రెసు అధ్యక్షుడు, శ్రీ దామోదరం సంజీవయ్యగారు, శ్రీ బూర్గుల రామకృష్ణారావుగార్లు ఉన్నారు. డెలిగేట్లలో కూర్చున్నవారిలో శ్రీ గోపాలరెడ్డి, శ్రీ కొండా వెంకటరంగారెడ్డి, శ్రీ కొట్టిపాటి బ్రహ్మయ్య, శ్రీ పిడతల రంగారెడ్డి ప్రభృతులు ఉన్నారు. వీరందరూ ప్రదేశ్ కాంగ్రెసుకు నాయకత్వం వహించినవారే. కాని, వీరికి సభాగౌరవం జరక్కపోవడం శోచనీయం. తీర్మానాలపై చర్చలలో పాల్గొనడానికి ఆహ్వానించకపోవడం అన్యాయం. ఫోటోలు తీయించుకొనడంలో ముప్పుటపడే చోటా నాయకులకు వేదికమీద చోటివ్వడం గర్హనీయం.

గుంటూరు ఏ. ఐ. సి. సి. చర్చల సరళి, ఆమోదించిన తీర్మానాల దోరణి మొత్తంమీద అవాస్తవికంగా ఉంది. అంతర్జాతీయ పరిస్థితులు, అందులోను కమ్యూనిస్టు చైనా అణుబాంబును తయారు చేయడం, భారతదేశం కూడా అణ్వస్త్రాలు తయారు చేయాలా లేదా అన్నది ముందుగా చర్చకు వచ్చింది. విదేశాంగమంత్రి శ్రీ స్వర్ణసింగ్, మాజీ రక్షణ మంత్రి శ్రీ కృష్ణమీనన్, శ్రీ దేబర్, శ్రీ బ్రహ్మానందరెడ్డి, చివరకు ప్రధాని శ్రీ లాల్‌బహదూర్ శాస్త్రి ఈ చర్చలో పాల్గొని కాంగ్రెసు విధానాలను పునస్మరణ చేశారు. గాంధీజీ అహింసా సిద్ధాంతాలు, నైతిక విలువలు, పండిట్ నెహ్రూ అలీన విధానం, ప్రపంచ నాయకత్వం వగైరాలను ఏకరువు పెట్టారు. కొత్త విషయం ఒక్కటీ చెప్పలేదు. ఇప్పటి విధానాలు మారాలని వాదించిన శ్రీ బిజూ పట్నాయక్, శ్రీ పి. వి. నరసింహారావు, శ్రీ బిభూతి మిశ్రా, శ్రీ పాండే, శ్రీ ఆజాద్ ప్రభృతులు వాస్తవికదృష్టిని వ్యక్తంచేశారు. తమ వాదన సహేతుకమనిపించుకున్నారు.

ఇక అంతర్జాతీయ వ్యవహారాల తీర్మానాన్ని ప్రతిపాదిస్తూ శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు చేసిన తెలుగు ప్రసంగం చాలామందికి ఆశ్చర్యం కలుగజేసింది. అంతర్జాతీయ వ్యవహారాలలో కూడా యింతగా ఆయనకు ప్రవేశం కలదా అనిపించింది.

## తీర్మానామోదం సరే, ఆచరణ?

రెండవ అధికార తీర్మానం ఆహార సమస్యకు సంబంధించినది. దీనిని వ్యతిరేకించాలనే అభిప్రాయం కొందరు ఆంధ్ర డెలిగేట్లు ప్రయివేటుగా వ్యక్తంచేశారు. కాని శ్రీ సంజీవరెడ్డిగారు దానిని ప్రతిపాదించడంతో ఏ ఒక్కరూ దానిని వ్యతిరేకిస్తూ మాట్లాడడానికి సాహసించలేకపోయారు. ఆ తీర్మానంతో ప్రభుత్వం నిర్ణయించిన ధరలకు ధాన్యాలను రైతులచేత విక్ర

శ్రీమతి లాల్‌బహదూర్‌తో, కూతురు, అలుడు, మనుమలు

## ఆహార సమస్య మీదనే ఆధారపడి వున్న

# శాస్త్రి ప్రభుత్వ భవిష్యత్తు!

తన చుట్టూ వున్న సహాయపాలకుల కొక నిర్దుష్టమైన క్రమశిక్షణా నియామావళిని ఏర్పరచి, సమర్థవంతమైన పరిపాలనను యీ ప్రమాద పరిస్థితులలో నైనా ఏర్పరచని పక్షంలో, ప్రధాని శాస్త్రిగారూ, వారి ప్రభుత్వమూ పటాపంచలయి పోతుందనే అభిప్రాయమొకటి న్యూఢిల్లీ అంతటా అల్లుకపోతున్నది. తత్ఫలితంగా దేశంలో అలజడీ, అరాచకమూ తప్పదనే సూచన కూడా లేకపోలేదు.

శాస్త్రికొక నమ్మకం ఉన్నది. పండిట్ పంత్ గారు చెపుతూ వచ్చినట్లు, పరిస్థితులు వాటంతట అవే సర్దుకొని పోతాయని శ్రీ శాస్త్రి అప్పుడప్పుడు అనుకొంటూ వుంటారు.

### నందా : పబ్లిసిటీ

అసలు, కేంద్రంలో ఒక్కొక్క పెద్దమనిషిది ఒక్కొక్క తత్వం. గుల్జారీలాల్ నందాగారున్నారంటే, ఆయనకు 'ప్రచారం' అంటే విపరీతమైన వ్యామోహం. తాను ఏం చేసినా నలుగురికీ తెలియాలనే తత్వం ఆయనది. 'వార్తలలో ప్రముఖ వ్యక్తి' ఆయన కాకపోతే అదో పెద్ద వార్త. ఇంత ఆర్భాటం జరిగినా, ప్రభుత్వ పక్షాన చక్కని నిర్ణయాలు చేసే దిక్కు, మొక్కూ లేదు. ఏవో ఊకదంపుడు నిర్ణయాలు చేసి, వాటిని అనుకొన్న ప్రకారం ఆచరణలో పెట్టే నాథుడు అంతకన్నా లేడు.

ఆ మధ్య ఒక సంఘటన జరిగింది. ధరల అదుపుల కోసం నినాదాలు చేసిన బృందానికి నందాగారు పుట్టెడు హామీలను ఇచ్చారు. నిరాశ్రయులయ్యామంటూ వచ్చిన మరో గుంపుకు 'మీ కేం ఫర్వాలేదంటూ' హోం మంత్రి ధైర్యం చెప్పారు. పైగా కొందరికి భూమి పుట్టా దానం చేస్తామని ఆయన అన్నారుట; ఆ భూమి అంతా తన సొంత సొత్తయినట్లు.

శాంతి, భద్రతలను సంరక్షించ వలసిన దేశీయాంగ మంత్రి దేశంలోనే, ఆయన కన్నుల ఎదుటనే ఇంతటి అక్రమాలు ప్రబలిపోతుంటే సామాన్యుడు చూచి కూడా చేయగలిగింది ఏముంటుంది? . . . మౌనం వహించటం తప్ప!

ప్రజల ప్రభుత్వం ఆధీనంలో ఉన్న (?) ఖాళీ భూమి ప్రజా ప్రభుత్వంలోని మంత్రి తమ ఇష్టం వచ్చిన వారందరికీ తలా కొంచెం ఇవ్వటమే గాక, వాళ్లందరికీ ఐదువందల రొఖ్ఖాన్ని కూడా ముట్ట చెప్పడం జరిగింది ఢిల్లీలో. ఈ సౌకర్యం పొందిన వాళ్లంతా, ఆయా స్థలాల్లో, ఏదో కాస్త కప్పు వేసికొని, దాన్ని విపరీతమైన ధరకు అద్దెలకివ్వటం, మళ్లా మంత్రుల దగ్గర కెళ్లి చెయ్యి చాచటం పరిపాటి అయిపోయింది. అంటే



(స్వయం) ప్రచారంలో మునిగి తేలుతున్న
**హోంమంత్రి శ్రీ నందా.**

వీళ్లంతా చిన్న తరహా భూస్వాములుగా తయారయిపోతారన్నమాట.

### అసమర్థులపాలన

'అసమర్థత' అనే పదానికి ఉండే నానార్థాలలో 'ఢిల్లీ కార్పొరేషన్' అనే పదం కూడా ఉండటం న్యాయమూ, సమంజసమూ. లంచగొండితనం సంగతి వేరే చెప్పనక్కరలేదు.

ఒకవైపు ప్రజలంతా "ఆ కొరత, ఈ కొరతల," వల్ల, అసమర్థపు పరిపాలన వల్ల సతమత మయిపోతుంటే, కార్పొరేషన్ ప్రబుద్ధులు మాత్రం 'పాయింట్ ఆఫ్ ఆర్డర్ల' మీద డిబేట్లను మామూలుగానే కొనసాగిస్తున్నారు.

### అనాథ నగరం

ఢిల్లీ నగరం ఒక అనాథ. ఈ నాటి భారత దేశమూ అంతే. కాని విషాదం ఏమంటే, ఈ దేశం యొక్క బాగోగులు ప్రభుత్వ పెద్ద లెవ్వరికీ కనుపించటం లేదనిపిస్తున్నది. కేంద్రంలోనూ, మంత్రివర్గంలోనూ ప్రతి ఇద్దరు నాయకులకు ఒక గ్రూపు, ముఠా. తగాదాల కోసం కేటాయించే సమయంలో నాలుగోవంతు కాలాన్ని దేశం కోసం వినియోగిస్తే, ఈ నాడు మీరూ, నేనూ ఇంతకన్నా బావుండేవాళ్లం!

సందర్భం ఎలాగూ వచ్చింది కనుక, మీకూ, నాకూ సంబంధించిన ముఖ్య సమస్యను గురించి చెప్పుకొందాం. ఆహారం ప్రతివానికీ అవసరమని చిన్నప్పుడే స్కూల్లో సైన్సు మాష్టారు చెప్పారు. అంతటి అవసరమైన ఆహారం గురించి ఈ నాడు దేశంలో నానా రభస జరుగుతున్నది. ఈ సమస్యను ఇంత భీకరంగా తయారు చేసిన దొంగ వ్యాపారిని సన్మార్గుణ్ణిగా చేద్దామని ప్రధాని శ్రీ శాస్త్రి ప్రయత్నం చేశారు. కాని కమ్యూనిస్టుల మాటే నిలచి పోయినట్లు అనిపించింది. నానా అల్లరీ చేసిన కమ్యూనిస్టులను; బొంబాయి, కొచ్చిన్ లలో తల ఎత్తిన సమ్మెలకు బాధ్యులైన కమ్యూనిస్టులను; ఈ సమ్మెల ద్వారా నిజంగా ఆహార కొరత ఏర్పడటానికి అవకాశమిచ్చిన కమ్యూనిస్టులను విస్మరించటంలో అర్థమే లేదు.

మరో మాట— రైతు కూడా అందరూ అనుకొనేటంత అమాయకుడు కాదు. పట్నవాసపు వాసన, ఆధునిక వర్తకపు రీతులతో పరిచయమూ లభించాక ఈ నాటి రైతు కూడా ధాన్యాన్ని నిలవ చెయ్యటం నేర్చుకొన్నాడని అనిపిస్తున్నది.

### చర్చలు ఎక్కువే

ఇటీవలగా 'ఆహార సమస్య'మీద జరిగిన చర్చలు లెక్కకు మిక్కుటంగానే ఉన్నాయి. మొదటిది పార్లమెంటు చర్చ, రెండవది ఆహారమంత్రుల సమావేశం, మూడు, నాలుగు సమావేశాలు అఖిల భారత కాంగ్రెసు ఆధ్వర్యాన ఢిల్లీ, గుంటూరులలో జరిగాయి. నిన్నకాక మొన్న జరిగిన గుంటూరు సమావేశం కూడా ప్రభుత్వపు తెలివితేటలనుగాని, ప్రజల(ప్రతినిధుల) తెలివితేటలనుగాని వెల్లడించగల ఏ అంశాన్ని వెలుగులోకి తీసుకురాలేకపోయింది. శాస్త్రిగారిది మూణ్ణాళ్ల ముచ్చటో లేక మరికొంతకాలం కొనసాగుతుందో నిర్ణయించవలసింది, నిర్ణయించగలిగిందికూడా ఈ తిండిగింజలే!

ఆహార పరిస్థితి ఇంత దౌర్భాగ్యంగా ఉంటే, మరో వైపునుంచి ఒరిస్సాలో అశాంతి, ఉత్తరప్రదేశ్ బీహార్, మధ్యప్రదేశ్, రాజస్థాన్‌లలో అసంతృప్తి ప్రజ్వరిల్లిపోతున్నట్లు వార్తలు దాడులుగా అందుతున్నాయి. అంతమాత్రాన ఢిల్లీనుంచి ప్రారంభోత్సవ ఉత్సవాల వార్తల సందడి తగ్గలేదు.

ప్రచారపు వ్యామోహం కేంద్రంలో ప్రతి ఒక్కరికీ ఒక సమ్మోహనాస్త్రం. ప్రతి కేంద్రమంత్రీ అంతా తనకే తెలిసినట్లు, మాట్లాడేవాడే. ఎస్.కె. పాటిల్ 'గోవా'ను గురించి గొడవచేశారు. అదే అంశంమీద శ్రీ చవన్ మరోరకపు ప్రకటన చేశారు. గోవా గొడవ పదేళ్ల పాటు అసంపూర్తిగా ఉండిపోవాలన్నారు ప్రధాని. ఈ మాట విన్న ఎస్.కె. పాటిల్

దానందభరితుడయ్యాడు. ప్రధాని ప్రకటనతో విన్న శ్రీ చవన్‌కు అగ్నిమీద గుగ్గిలం వేసినట్లయింది. ప్రజాస్వామ్యంలో ఏ సమస్యా ముగిసిపోకూడదనే శ్రీ నెహ్రూ సిద్ధాంతం ప్రకారం గోవా విస్తృత రూపాన్నే ధరించి ఉన్నది.

## కాంగ్రెసువారి ప్రగల్భాలు

అ…ట్లు, అహో సమస్యనలో కదూ ఉన్నాం! దేశ

## న్యూఢిల్లీ లేఖ

నింగు అసాధ్యమని ఖచ్చితంగా చెప్పారు ముఖ్య మంత్రులు. వీళ్లకు సమాధానంగా 'ఆర్డినెన్సు' జారీచేసి, అమలుజరిపిస్తే బాగుంటుంది.

జాతి యావత్తూ, ఈ అల్లకల్లోలం చాటున మగ్గి, మసి అయిపోకుండా రక్షింపబడే మార్గం ఏదైనా ఉన్నదా? లోగడనే పత్రికలూ, సంపాదకులూ సూచించిన మార్గం ఒకటున్నది— అది :

కాంగ్రెసు పెద్దలు ముందెన్నడో వేయ దలచుకొన్నదాన్ని గురించి, అదినుంచే ప్రగల్భాలు చెప్పటం మానేయాలి!

—శ్రీకృష్ణ ★




గుంటూరులో
అఖిలభారత
కాంగ్రెసు సమా
వేశం జరిగింది-వార్త
75 లక్షలు
గంగపాలు


ప్రభుత్వ విధానాలకు ఎ.ఐ.సి.సి. ఆమోదం


సరే!
సరే!
ఎ.ఐ.సి.సి


మన ఒప్పందాన్ని ఇలా అమలు జరుపుతున్నారన్న మాట?
సింహళం


సిలోనులో ఇండియన్లు


సవతి తల్లి ప్రేమ


సార్! సార్! కాంగ్రెసును వదిలిపోకండి సార్!
కైరాన్ బెదిరింపులకు
కామరాజ్ లొంగుబాటు

# యుకారిస్ట్ కాంగ్రెస్!

యుకారిస్ట్ కాంగ్రెస్ రోమన్ కాథలిక్‌లకు సంబంధించిన ఒక పెద్దసభ. ఇది నవంబరు ఆఖరున బొంబాయిలో జరుగనున్నది. దీనికి రోమన్ కాథలిక్‌ల అధిపతి అయిన 'పోప్' కూడా రాబోతున్నారుట. ఈ సభ కోసం ఎన్నో ఏర్పాట్లు పెద్ద పెట్టున జరుగుతున్నాయి. ఈ ఏర్పాట్లకు భారత దేశ ప్రభుత్వం వీలయినంత సహాయం చేస్తోంది. అంతేకాక, ప్రధానమంత్రి, రాష్ట్రపతి, మొదలయిన వారు పోప్‌ని కలుసుకునేందుకని బొంబాయి వెడతారుట.

ఇంతదాకా, పోప్ బయట దేశాలలో జరిగే ఉత్సవాలకి వెళ్ళలేదుట. కాబట్టి, ఇది ఒక గొప్ప విశేషంగా ఊహించి మన ప్రభుత్వం యింత గౌరవం చేయ దలచినదని ఊహించినా తప్పు లేదు. కాని, భారతదేశంలో కొన్ని వర్గాలవారు 'యుకారిస్ట్' సభని పోప్ చేసే ఒక దండయాత్రగా, హైందవమతం మీద దాడిగా భావించి, తమ నిరసన ప్రకటిస్తున్నారు. పోప్ వచ్చినప్పుడు 'నిరసన ప్రదర్శనలు' వారి ఉద్దేశమని కూడా తెలుస్తోంది! ఈ వర్గాలవారి ఉద్దేశ్యాలు ఎంతదాకా ఫలిస్తాయో చెప్పటం కష్టం. అయితే—రోమన్ కాథలిక్ మతాధిపతి భారతదేశంలో జరిగే ఒక సభకి రావటం ఉచితమా, కాదా? ఆయనని ప్రధానమంత్రి, రాష్ట్రపతి స్వయంగా వెళ్లి చూడటం ఎంతవరకు సబబు?—ఈ రెండు ప్రశ్నలు వేసుకుంటే గాని ఈ సందర్భంలో జరిగే వాదవివాదాలని నిష్పక్షపాతంగా పరిశీలించలేము.



ఇండియా వస్తున్న పోప్ పాల్

భారత దేశపు రాజ్యాంగం మత ప్రధానమయినది కాదు. భారతదేశంది 'సెక్యులర్' విధానం. ఇక్కడ నివసించే ప్రజలందరికీ తమ మతాలకి సంబంధించిన ఆచారాలని - ఇతరులకి హాని కలిగించకుండా-పాటించే హక్కు ఉంది. ఈ హక్కు రోమన్ కాథలిక్‌లకీ ఉంది. 'యుకారిస్ట్ సభ' వారి మతానికి సంబంధించిన ముఖ్య కార్యక్రమాలలో ఒకటి. ఇది జరిపినంతమాత్రాన భారతదేశంలో ఇతరులకి కలిగే హాని ఏమిటో అర్థం కాదు. ఇక, ఈ సభకి ఆ మతంవారు తమ అధిపతిని పిలుచుకుంటున్నారు. ఇందులో ఉండే అనౌచిత్యం ఏమిటో కూడా అర్థం కాదు.

'హైందవ మతం మీద ఈ విధంగా దాడి చెయ్యటానికి ప్రయత్నిస్తున్నార'ని కొందరి ఆరోపణ. బౌద్ధ, మహమ్మదీయ, మతాలలాగే క్రైస్తవ మతం కూడా ఇతరులను తనలో చేర్చుకోవాలని ఆశిస్తుంది. ఇందులో కొత్త ఏమీ లేదు. ఇది పందొమ్మిది వందల ఏళ్ళ పైగా ఉన్నదే. రోమన్ కాథలిక్ మతం క్రైస్తవ మతంలో ఒక భాగం.

ఈ తెగవారు భారత దేశంలో చాలా కాలం నుంచి తమ మత ప్రచారం చేసుకుంటున్నారు. ఇన్నాళ్ళుగా లేనిది, ఈ యుకారిస్ట్ కాంగ్రెసు వల్ల హైందవ మతానికి గాని, భారత దేశానికి గాని వాటిల్లే ప్రమాదం ఏమిటి? శతాబ్దాలుగా బ్రిటిష్ ప్రభుత్వం క్రిందలేని బలం కొన్ని రోజులు మాత్రం జరిగే ఈ సభ ద్వారా కాథలిక్‌లకి వచ్చేస్తుందా? అసలు ఇంత మాత్రం ప్రచారానికి హైందవ మతం తట్టుకోలేదా? నిదానంగా ఆలోచించి చూస్తే పై ప్రశ్నలన్నిటికీ ఒకే రకం సమాధానం దొరుకుతుంది.

ఇక ప్రధాన మంత్రి, రాష్ట్రపతుల బొంబాయి యాత్ర విషయం పరిశీలించవలసి వస్తుంది. పోప్‌ని ఒక ప్రత్యేక 'రాజ్య'పు అధిపతిగా పరిగణించి, 'వాటికన్'తో భారత దేశం ఒక రాయబారిని నియమించింది. అందుచేత ఈ దేశం అధిపతులు పోప్‌ని వెళ్లి సందర్శించటంలో అనుచిత మయినదేమీ ఉన్నట్లు కనిపించదు. పైగా ఈ దేశానికి వస్తున్న ఒక మతాధికారిని నిరసన ప్రదర్శనలతో 'ఆహ్వానించటం' అలా చేసే వారి అనాగరికతని సూచించటమే కాక తక్కిన వారందరినీ ఇబ్బందిలో పెట్టినట్లు అవుతుంది.

—ఒక విలేఖరి.

కుక్కలు, నేను నక్కను. మనవాళ్లంతా ఒక్కటే! మీ స్నేహం కోరివచ్చినవాడను శాంతించండి.'' అంది నక్క.

కుక్కలు వినలేదు. ''నీ వాలకం చూస్తే జిత్తులవారి లాగున్నావు. నీ మాటలు మేము నమ్మము. నీ పేరు నక్కయ్యే అయినా, మీ ఇంటిపేరు టక్కరే కదా ?'' అంటూ అవి నక్కను కరువబోయాయి. నక్క ''హా! బంగారన్నా! నిరపరాధిని ! ఆపదలో ఉన్నాను. రావా? రక్షింపవా ?'' అంటూ గొంతు చించుకుంది. ఈ కేకలు చెవినిబడేవరకు ఈ గొడవంతా బంగారుకు తెలియదు. అతడు నక్క దగ్గరికి పరుగు పరుగున వచ్చాడు. కుక్కలను శాంతించమన్నాడు. ''ఆవేశం తగదన్నానా ? ఎన్ని చెప్పినా మీ మనస్సులు మాత్రం మార్చలేకుండా పోతున్నాను.'' అంటూ వాటిని మందలించాడు. ''నక్కబాబూ ! వాటి తొందరపాటుకు ఏమనుకోకు !'' అన్నాడు నక్కతో.

నక్క బంగారును రెప్పలార్పకుండా కొద్ది క్షణాలు చూచింది. ''నువ్వేనా ? నా బంగారువి నువ్వేనా ? నేను పిలిచిన బంగారన్నవు నువ్వేనా ? ......ఈనాడెంత సుదినం !.....నా జన్మ పావనమై పోయింది !.....'' అంది పట్టరాని సంతోషంతో.

''నీ బంగారు ఎవరో నాకు తెలియదు. కానీ నా పేరు కూడా బంగారే ! నువ్వు అనుకుంటున్న బంగారు నేనే అయితే— నానుండి నువ్వు కోరే దేమిటో చెప్పు !'' అన్నాడు బంగారు.

''బంగారన్నా ! ఆ మాట చాలు ! నిన్ను చూడాలని చాలాకాలంగా అనుకుంటున్నాను. ఈనాడు నా కోరిక నెరవేరింది. నువ్వు సెలవిచ్చిన నీతులు నా మనస్సులో నాటుకున్నాయి !.... మంచితనం నేర్చుకుంటున్నాను. మాంసాహారం మానేశాను. ఇప్పుడు ఎండ్రకాయలు నా వీపుమీదికి ఎక్కి ఆడుకుంటున్నాయి. నువ్వు నమ్మితే నమ్ము, నమ్మకపోతే పో— నేటికి ఐదు రోజులనుండి పచ్చి మంచినీళ్లతో ప్రాణాలు నిలబెట్టుకుంటున్నాను. నా ఆకలి సమస్యను నువ్వు తీర్చలేకుండా పోతావా అనే ఆశతో నీ కోసం వచ్చాను. ఆకలి! హా ! కలి !'' అంది నక్క.

''అయ్యో పాపం ! అయితే ఒక్క క్షణం ఆగు అంటూ బంగారు— సమీపంలోని ఒక చిన్న మడుగులోనుండి పెద్దపెద్ద తామరాకులు రెండు త్రుంచుకొచ్చాడు. వాటిని గిన్నెలా చుట్టి దాని నిండుకు ఆవుల పాలు పిదికాడు. నక్కకిచ్చి త్రాగమన్నాడు. నక్క గుటగుటా త్రాగి, ''అమ్మయ్య కడుపు నింపావు ! పోయిన ప్రాణం లేచి వచ్చింది. ఆవుపాలు చాలా రుచిగా ఉంది !'' అన్నది. ''ఆవు పాలే ఇంత రుచిగా ఉంటే ఆవు మరెంత రుచిగా ఉంటుందో!'' అని కూడ అనబోయి నాలుక కరచుకొంది.

''మా ఇంట్లో అందరమూ పాలే త్రాగుతాము. మా కుక్కలు, పిల్లులు కూడ పాలే త్రాగుతాయి. నీ ఒక్కడికి పాలు ఇవ్వలేకపోతానా ?....నీకు ఆకలైనప్పుడల్లా వచ్చి పాలు త్రాగి పోవచ్చు'' అన్నాడు బంగారు.

''బంగారన్నా ! పాలతో నా ఆకలి సమస్య తీర్చావు. పాలవంటి నీ మనస్సులోకూడ నాకు స్థానమివ్వ పెట్టవా ? మనమిద్దరం [illegible] టానికి వీలులేదా ?'' అంది నక్క.

''ఎందుకు వీలులేదు ? ఈ భూమాతే మన తల్లి ! దేవుడే మన తండ్రి ! సకల జీవరాసులూ అన్నదమ్ములే !'' అన్నాడు బంగారు.

''అయితే నీ నోరారా నన్ను తమ్ముడా అని పిలువు— చాలు !'' అని ప్రాధేయపడింది నక్క.

దాని ప్రార్ధన మన్నించాడు బంగారు. ''తమ్ముడా నీ అన్నతో ఉన్నంత చనువుగా నువ్వు నాతో ఉండవచ్చును. ఈనాటినుండి మనమిద్దరం అన్నదమ్ములమే !''

నక్క సంతోషానికి మేరలేకపోయింది. అది ఆనాటినుండి ప్రతిరోజూ బంగారువద్దకు వచ్చేది. కావలసినంత పాలు త్రాగేది. బంగారు చెప్పే నీతులు శ్రద్ధగా వినేది. సాయంకాలం కాగానే, తాను నివసించే కనుమలోకి వెళ్లిపోయేది.

తన ఘనతను చాటుకోడానికి దానికిప్పుడు మంచి పట్టానే దొరికింది. ''నేనును బంగారన్న తమ్ముణ్ణి! బంగారు మా అన్న ! బంగారన్న కష్టసుఖాలలో నాకు సమపాలున్నది. నా కష్టసుఖాలలో అతనికి సమపాలున్నది ! ''అని బంగారు అవు [illegible] పుట్టి పెరిగిన కనుమవరకు అందరితో చెప్పుకున్నది. ఆకాశ సంచారం చేసే పిట్టలకు కూడ చెప్పుకుంది.

అన్నదమ్ముల చెలిమి నిరాటంకంగా కొనసాగిపోతూనే ఉంది. ఒకనాడు నక్క బంగారంతో ఈ విధంగా అన్నది.....''బంగారన్నా ! అనగా అనగా ఒక వూళ్లో ఒక గొప్ప ధనవంతుడుండేవాడు. అతనికి ఇద్దరు కొడుకులుండేవారు. ఆ ధనవంతుడికి అవసానకాలం సమీపించింది. అతడు చచ్చిపోయాడు. అప్పుడు రెండవ కొడుకు దేశాంతరంలో ఉన్నాడు. కొంతకాలానికి అతడు తిరిగి వచ్చాడు. ఆస్తిలో తన పాలు తనకిమ్మని అన్నను అడిగాడు. అందుకు అన్న ససేమిరా— వీల్లేదన్నాడు. ఒక చిల్లి గవ్వకూడ ఇవ్వనన్నాడు.......ఇది న్యాయమేనా ? ఆ చిన్నవాడి గతి ఏం కావాలి ?...నువ్వే అన్నవైతే ఏం చేసేవాడివి ?''

''అది ఎంతమాత్రం న్యాయం కాదు. ఆ ఆస్తిలో అన్నకెంత హక్కుందో తమ్ముడికీ అంతే హక్కు ఉంది. నేనే అన్ననైతే నా తమ్ముడికి సంతోషంగా సమభాగం ఇచ్చేసేవాడిని !'' అన్నాడు బంగారు.

''అయితే అన్నయ్యా ! నీ [illegible]



# బంగారు నడచిన బాట

న్ని నాకు సంతోషంగా ఇవ్వరాదా ?...." అన్నది

ఇది విని బంగారు నిర్ఘాంతపోయాడు.

"పలకవేం ?" అంటూ రెట్టించింది నక్క.

బంగారు ఇంకా విస్మయంలోంచి తేరుకోలేదు !

నక్క బంగారును అసహ్యించుకుంది. "ఛీ నిన్ను గొప్పవాడనుకున్నాను. పొరబాటు !....నీలో ఇంత స్వార్థం ఉందనుకోలేదు. మనం అన్నదమ్ములమని ఎందుకన్నావు ? అంతా బూటకం ! భాగం అడుగగానే ముఖం ఎలా వెలవెలబోయిందో చూడు ! నేను నీ సోదర ప్రేమను పరీక్షిస్తున్నానని ఎందుకనుకోగూడదు ? ఛీ! నీ కడుపులో ఇంత కపటం ఉందని ముందే తెలిసి ఉంటే నీతో చెలిమి చేసి ఉండేవాడినేనా?.......... వెళ్లివస్తాను సోదరా! నీ మైత్రికి నా స్వస్తి !" అంటూ నక్క వెళ్లిపోబోయింది.

వెంటనే బంగారు ఆపేశాడు. "అయ్యో తమ్ముడూ ! తొందరపడకు! నన్ను అపార్థం చేసుకోకు ! నువ్వు నా తమ్ముడివని ఎప్పుడన్నానో— అప్పుడే నీకు నా సంపదలో భాగమేర్పడింది నా ఆవుల్లో కొన్నిటిని నీకు హృదయపూర్వకంగా సమర్పిస్తున్నాను. తీసుకుపో !" అన్నాడు.

కుక్కలు మాత్రం ఇందుకు అసమ్మతిని తెలియజేశాయి.

"స్వామీ ! ఈ నక్క ఏకులా వచ్చి మేకై కూర్చుంటుందని మొదటినుంచీ మేము అనుకుంటూనే ఉన్నాము. మొదటిసారిగా దీని ముఖం చూడగానే తెలిసిపోయింది. ఇది జిత్తులమారిదని. ఇప్పుడు మన వేలితో మన కన్నే పొడవజూస్తున్నది. దీనికి ఒక్క ఆవు కూడా ఇవ్వవద్దు. నువ్వు ఊ అను— దీని తొక్క చీల్చి, డోలు కట్టించి, దీని మోసాన్ని గురించి దండోరా వేయించేస్తాం ." అన్నాయి అవి ఆగ్రహావేశంతో.

"ఆగ్రహావేశాలు తగవన్నానా ? ఎన్ని చెప్పినా మా దాతే మాది. వూరుకోండి !" అన్నాడు బంగారు. అతడు తన మందలోంచి అయిదు మంచి ఆవుల్ని ఏరాడు. "తమ్ముడూ ! నా కుటుంబం పెద్దది. నేను నా భార్య, నా కుక్కలు, పిల్లలు, నా అతిథి అభ్యాగతులు అందరూ ఈ ఆవులమీదనే ఆధారపడి ఉన్నాం. కాబట్టి నీకు అయిదు ఆవుల్ని ఇస్తున్నాను. ఈ అయిదు ఆవులూ అయిదు జీవనదులవంటివి. వాటి పాలతో నీ బ్రతుకు హాయిగా గడచిపోతుంది. వీటిని తీసుకో !......నువ్వు ఎప్పుడూ నా తమ్ముడివే !" అంటూ ఆ ఆవుల్ని నక్కకు ఇచ్చివేశాడు. "ఇకనుంచి మీరు నా తమ్ముడి సొత్తు. అతనితో వెళ్లండి !" అన్నాడు ఆ ఆవులతో.

నక్క ఆనందంతో ఒళ్లు మరచిపోయి, కల్లు త్రాగిన కోతిలా నాట్యం చేస్తూ ముందు నడిచింది. అయిదు ఆవులూ దాన్ని అనుసరించాయి. కుక్కలు మాత్రం అక్కసు పట్టలేక పోయాయి. "అంతా నటన ! చూస్తూ ఉండు. అది ఆవుల్ని ఒక్కొక్కటిగా పొట్టన బెట్టుకుని, మళ్లా ఏడో ఎత్తు వేయకపోతే ?......." అన్నాయి బంగారుతో.

"శాంతి ! శాంతి !" అన్నాడు బంగారు.

(ఇంకా వుంది)

## గుండె జలుబును వెంటనే పోగొట్టుకోండి

# అమృతాంజనం

## పైనేరాసి త్వరగా గుణాన్ని పొందండి

అమృతాంజన్ బాధా నివారిణి నిరపాయకరంగా శీఘ్రంగా గుండె జలుబుకి సాధారణ జలుబులకు అమోఘంగా గుణాన్ని కల్గించడానికి 10 రకాల ఔషధాలు చేరిన మందు. కండనొప్పులకు, తలనొప్పికి, బెణుకులకు కూడా అమృతాంజన్ అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా నెలల తరబడి వస్తుంది మీ కుటుంబానికంతా. అవసరానికెప్పుడూ అందుబాటుగా అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పుల జలుబుల నివారణకు 10 రకాల ఔషదాలు చేరిన మందు




అమృతాంజన్ లిమిటెడ్, మద్రాసు - బొంబాయి - కలకత్తా - ఢిల్లీ

# క్యారేజీల్లోకి...

హేమలతా కైలాసం

"సంతోషమే సగమెన బలమౌను" పిల్లల్తో కలకల్లాడే ఇల్లు చూస్తే ఎవరికేనా ఆనందం కలుగుతుంది. ఇంక ఆ తల్లిదండ్రుల విషయం వేరే చెప్పాలా? ఎదిగే పిల్లలకి అమ్మా నాన్నల ఆదరణతో పాటు పుష్టికరమైన ఆహారం కూడా అతిముఖ్యం. బుజానికి "సంచి" తగిలించుకొని ఒక చేత్తో జారిపోయే నిక్కరు పైకెగతోసు కుంటూ, ఇంకో చేత్తో క్యారేజీ పట్టుకొని ముద్దు ముద్దుగా నడుస్తూ స్కూల్ కెళ్లే పిల్లల్ని చూస్తే ముచ్చటేస్తుంది.

పిల్లలు రోజూ అన్నమేనా అని మారాం చేస్తే ఏదో ఒకటి ముందుగా అనుకొని పెందరాళే లేచి చేసి క్యారేజీ సర్ది పంపితే పిల్లలూ సంతోషిస్తారు. మనకీ హైరాన, ఖర్చూ కలిసి వస్తాయి.

### బనానా బాత్

మాగిన అరటిపండ్లు ఆరు, కమ్మటి పెరుగు, పచ్చి మిర్చి, జీడిపప్పు, పోపు.

మాగిన అరటిపండ్లు తొక్కవల్చి, చాకుతో చిన్న చిన్న ముక్కలు చేసి, కవ్వంతో చిలికితే గుజ్జులా అవుతాయి. పెరుగులో పచ్చిమిర్చి, ఉప్పు, వేయించిన జీడిపప్పు, పోపువేసి కలపాలి. అన్నంలో దాన్ని వేసి కలిపి పూరాక పిల్లలకి పెడితే క్యారేజీలోకి ఉంటుందో ఉండదో అని అనుమానపడ్డారు.

### టమేటా బాత్

టమేటా పళ్ళు అరకిలో, నాలుగు ఉల్లిపాయలు, కొత్తిమీర, జీడిపప్పు, పోపు.

పులిహోర అన్నంలా వార్చి ఉంచుకోవాలి. టమేటాటాలు, ఉల్లిపాయలు, పచ్చిమిర్చి, కొత్తమీర సన్నగా చిన్నచిన్న ముక్కలు తరిగి, ఉప్పు, పోపువేసి కలిపి ఓ పావుగంట వూరనియ్యాలి. అన్నం బేసిన్‌లో గుమ్మరించి కాస్త పసుపువేసి వూరపెట్టిన టమేటా ముక్కలు వేసి కలిపి రుచిచూశారో. . .

### లెమన్ బాత్

నిమ్మ ఉప్పు అరతులం, పోపుసామాను, జీడిపప్పు, కరివేపాకు, పచ్చిమిర్చి

అన్నంలో కరివేపాకు, పచ్చిమిర్చి ముక్కలు, చిటికెడు పసుపు, అరతులం నిమ్మ ఉప్పు, పోపు వేసి బాగా కలిపి వూరనియ్యాలి. పోపులో చిన్న ఇంగువ పలుకు వేస్తే ఘుమ ఘుమ లాడుతూ ఉంటుంది.

### ఆరెంజిబాత్

నారింజ రసం వేసి పైన చెప్పినట్టు చేసుకు తింటే. . . .

### మిక్చర్ బాత్

నిమ్మకాయలు డజను, ముల్లంగి దుంప ఒకటి, కొస్త మామిడి అల్లం లేక అల్లం, బీముకాయ, ఆలుగడ్డ, క్యాలీఫ్లవర్ కోళ్ళు, నూల్ కోల్, బీట్ రూట్, క్యారెట్, జీడిపప్పు, పచ్చిమిర్చి చిన్నచిన్న ముక్కలు తరుక్కోవాలి.

నిమ్మకాయ రసంలో ఉప్పు, పసుపు పై ముక్కలు వేసి కలిపి అరగంట వూరనిచ్చి అన్నం పైన వేసి కలిపి శ్రీవారికి పెట్టారంటే. . . .

### కొబ్బరి బాత్

ఒకకాయ కొబ్బరికోరు, పోపుసామాన్లు, జీడిపప్పు, పచ్చిమిర్చి, కరివేపాకు.

పోపు వేయించేటప్పుడు కొబ్బరికోరు కూడా ఎర్రగా వేయించి అన్నంలో వేసి కలపాలి. పోపులో ఓ స్పూన్ పంచదార వేశారంటే. . . .

### దాల్ బాత్

కందిపప్పు అర్ధపావు, బియ్యం అర్ధశేరు, ఆలూ, పచ్చిబటాణీ, టమేటా, క్యాలీఫ్లవర్, క్యాబేజీ, వంకాయ, ఆనపకాయ, గుమ్మడికాయి, ఇంట్లో ఉన్న కూరముక్కలు. కాస్త చింతపండు. మిరియాలు, ధనియాలు, జీలకర్ర, ఇంగువ, సెనగపప్పు, మినపప్పు, ఎండుమిర్చి, ఆవాలు, మెంతులు, ఎండుకొబ్బరి.

కూర ముక్కలన్నీ నేతిలో కాస్సేపు వేయించి, నీళ్ళు పోసి కందిపప్పు, బియ్యం, ఉప్పు వేసి కలిపి అత్తిసరులా ఉడకనియ్యాలి. పోపు వేయించి, గుండ కొట్టి మరుగుతోన్న చింతపండు పులుసులో వెయ్యాలి. అన్నం గుమ్మరించి చింతపండు పులుసు వేసి బాగా కలిపేటట్టు కలిపి తిన్నారంటే వదలరు.

### మిరియంవడ

మిరియాలు, టమేటాలు, జీడిపప్పు నేతిలో వేయించి, నీళ్ళు పొయ్యాలి. ఎసరు మరుగుతోంటే ఉప్పు, బియ్యం పోసి, ఉడికాక దింపి, గిన్నెడు నెయ్యి వేసి కలిపి రుచి చూశారో..

### దహీ బాత్

పెరుగులో చిటికెడు పసుపు, ఉప్పు, పచ్చిమిర్చి, కొత్తమీరి వేసి కలపాలి. ఆలుగడ్డలు, టమేటాలు, వంకాయ ముక్కలు, క్యాలీఫ్లవర్ కోళ్ళు నేతిలో వేయించి పెరుగులో కలిపి, ఆవాలు, మెంతులు, ఎండుమిర్చి, వాము వేయించివేసి కలపాలి. అన్నంలో వేసి కలిపి పూరాక తింటే రోజూ తిన్నా విసుగనిపించదు.

### సగ్గుబియ్యపు దద్దోజనం

సగ్గుబియ్యం మంచివి, పెరుగు, పచ్చిమిర్చి, కరివేపాకు, చిటికెటు సొంఠిపొడి.

పెరుగులో పసుపు, పచ్చిమిర్చి, కరివేపాకు, సొంఠిపొడి, ఉప్పువేసి నేతిలో వేయించిన సగ్గుబియ్యం వెయ్యాలి. ఆవాలు, మెంతులు, ఎండుమిర్చి నేతితో వేయించి కలిపి నాలుగు గంటలు వూరనియ్యాలి. మధ్యమధ్య మూతతీసి చూసి పెరుగు పీల్చుకొంటే ఇంకాస్త పోసి కలిపి పూరాక తిని ఎలా ఉందో చూడండి.

### బనానామిల్క్ బాత్

మాగిన అరటిపండ్లగుజ్జు, బెల్లంపొడి, కాగిన పాలువేసి కవ్వంతో చిలికితే నురుగు వస్తుంది. అప్పుడు అన్నం వేసి వేయించిన జీడిపప్పు, ద్రాక్ష కిస్‌మిస్, మిరియంపొడి వేసి కలిపి పిల్లలకి పెడితే రోజూ చెయ్యమంటారు.

గోధుమ చాలా బలమైన ఆహారం. రోజూ పుల్కాపుల్కా, చపాతీలు, పూరీలు చేసి పెడితే పిల్లలు పేచీ పెడతారంటే ఇలా చేయండి.

### క్యాబేజీ చపాతీ

క్యాబేజీ సన్నగా తరిగి ఉప్పువేసి ఉడికించి గోధుమపిండిలో వేసి కలిపి రెండు గంటలు నానాక

---

**ఎంత మాట!**

ఆధునికులు, విద్యాధికులు ఐన స్త్రీలలో మాడస్టీ [లజ్జ] హెచ్చుగాను [పవిత్రత] ఛేస్టిటీ ఆఖరిదిగాను వున్నట్లు కోయంబత్తూరులో ఒక శతమానం విశ్వవిద్యాలయ విద్యావతులను పరిశీలించి తయారు చేసిన నివేదిక తెలుపుతోంది. "ఉన్నత విద్య: కుటుంబ జీవితం మీద దాని ప్రభావం" అనే సర్వేలో 108 గురు పరిశీలనకు గురి అయ్యారు.

108 మంది విద్యావతులలో 30 మంది 'వినయ ప్రవర్తన' కి మొదటి జాగా యిచ్చారు. 28 మంది భక్తికి, ఋజువర్తనకి 22 మంది, ప్రేమాభిమానాలకి 20మంది, ఆఖరున పవిత్రతకి 18 మంది మొదటి జాగాలు యిచ్చారు. "అంటే పవిత్రతా? నువ్వు ఆఖర్న వున్నావు అన్నమాట!"

(ఇండియన్ ఎక్స్‌ప్రెస్ వార్త ఆధారంగా)

---

చపాతీల్లా వత్తి, కాల్చవచ్చు. లేకపోతే పూరీల్లా వేయించుకోవచ్చు.

## నిమ్మ పూరీలు

సరిపడా నిమ్మ ఉప్పు గోధుమపిండిలో వేసి కలిపి నానిన వెనుక పూరీలు చేసి నేతిలో వేయించాలి.

## బనానా పూరీ

మాగిన అరటిపళ్ళ గుజ్జులో పంచదార, గోధుమపిండి వేసి కలిపి గట్టిగా నానాక పూరీలువత్తి నేతిలో వేయించాలి. చపాతీల్లా చేస్తే నెయ్యి ఎక్కువ అవదు. ఇది తింటే పిల్లలు మిమ్మల్ని వదలరు.

## కొబ్బరి పూరీ

ఒకకాయ కొబ్బరికోరు టబ్బి చిక్కగా పాలు తీసి, ఆ పాలలో పంచదార వేసి గోధుమపిండి కలిపి నానాక వత్తి, నేతిలో వేయించాలి.

## పూరీ స్వీట్

పూరీలు పల్చగా వత్తి వేయించి గుండ కొట్టాలి. (మెత్తగా అక్కరలేదు) పంచదార, లేక బెల్లం పాకం పట్టి ఈ గుండ, జీడిపప్పు, ద్రాక్ష, కిస్‌మిస్, పచ్చ కర్పూరం వేసి కలిపి లడ్డూ కట్టి

56 వ పేజీ చూడండి



# పిరికివాడు

యస్. జోహార్



"మాష్టరుగా !"

"ఏంకావాలి అరుణా ? ...."

"మరీ, మా అక్కను పెళ్లిచేసుకో నన్నారుటగా!" ఆశ్చర్యంగా, అమాయకంగా మొహంపెట్టి అడిగింది అరుణ.

అరుణ కళ్లలో అమాయకత్వం తొణికిసలాడు తుంది. ఏం చెప్పాలో తెలియక అరుణ కళ్లల్లోకి చూస్తూ కూర్చున్నాడు రావు.

"ఏం మాష్టారు మాట్లాడరు ?" ఈసారి కంఠంలో కాస్త విసుగు ధ్వనిస్తూ మరీ అడిగింది అరుణ.

"మీ అక్కయ్యాసితో చెప్పిందా అలా అని ?"

"ప్రొద్దుటనుండి మంచినీళ్ళు కూడ ముట్ట లేదు. రాత్రంతా అక్క ఏడుస్తూ పడుకుంది. కళ్లన్నీ వాచిపోయి...." నిజంగా తన అక్క బాధను చూసి సహించలేనట్లుగావే చెప్పింది అరుణ.

ఒక ప్రాణి ఒకరి గూర్చి బాధపడుతుంటే అతని మనస్సు జాలితో నిండిపోయింది.

"మరి .... నే నడిగిన దానికి సమాధానం చెప్ప లేదే మాష్టారు ?"

"ఏం చెప్పమంటావు అరుణా. చెప్పినా అర్థం చేసుకొనే వయస్సుకాదు నీది.'

"అంతేనా మాష్టారు .... మరి మా నాన్నగారు మా అరుణ కూడా ఎదిగి పెద్ద దయి పోయింది ! అంటుంటారు ...." అమాయ కంగా, ఆశ్చర్యం ఉట్టిపడుతూ నాన్నగారు చెప్పింది తప్పేమో అనే సందేహం వ్యక్తంచేస్తూ అడిగింది అరుణ.

"మీ నాన్నగారు చెప్పింది నిజం అయితే .... ఇంత అమాయకురాలిగా అడిగిఉండేదానివి కాదు." ఆయన ఎదురుప్రశ్న వేసేటప్పటికి ఏం చెప్పాలో అర్థంకాలేదు అరుణకు. మరల మాష్టారును పలక రించటానికి ధైర్యం చాలలేదు అరుణకు. ఏదీ అడగా లని.... తన అనుమానాలు నివృత్తి చేసుకోవాలని వచ్చిన ఆలోచనలు బలవంతంగా అణగద్రొక్కు కుంది అరుణ. అరుణ ముందు పుస్తకం అయితే ఉంది గానీ, చదువుమీద దృష్టి లగ్నం కావటం లేదు. ఆలోచనలన్నీ అక్కయ్య, మాష్టారు చుట్టూ తిరుగుతున్నాయి. ఆ చిన్న హృదయంలో అక్కయ్య ఆవేదన .... మాష్టారి నిర్లిప్తత అర్థం చేసుకోలేకపోతుంది. ఎంత ఆలోచించినా ఏం అర్థంకావటంలేదు. నిజంగా మాష్టారు అన్నట్లుగా తను అమాయకురాలినేమో ! అనే అనుమానం అరుణ మనస్సులో రాకుండా పోలేదు. రాత్రి అక్కయ్య ఆవేదన ... ఏడుపు అంతా జ్ఞాపకానికి వచ్చింది అరుణకు .....

"ఎందుకక్కా ఏడుస్తున్నావు ?" ఇంకోసారి బ్రతిమాలుతూ అడిగింది అరుణ.

''చెప్పవా అక్కా. నీ చెల్లెల్నికాదూ. నువ్వేడు స్తుంటే నాకు కూడ ఏడుపొస్తుంది అక్కా! నాన్నగారితో చెప్పనా ?'' అంది ఆఖరుసారి బ్రతిమాలుతూ విసిగిపోయిన అరుణ.

చెల్లెల్ని గట్టిగా హృదయానికి హత్తుకుంది ఉష. చిన్నగా అరుణ ఉష కన్నీళ్లు తుడుస్తుంది, చేతివేళ్లతో. తన హృదయంలో మండే మంటలు. అరుణకు చెప్పినా అర్థంకావని ఉషకుకూడ తెలుసు.

''నీకు తెలియదు అరుణా! నాబాధ నీవు అర్థంచేసు కునే వయస్సు కాదు నీది.''అంది భోరున ఏడుస్తూ.

ఏమీ తోచలేదు అరుణకు. అయినా నాయనగారితో చెప్పాలనుకుంది అరుణ. కానీ అక్క కౌగిలినుండి విడివడటానికి మనస్సు అంగీకరించలేదు.

''నాన్నగారితో చెప్పకుదూ ?'' అంది ఉష హృదయాన్ని చిక్కబట్టుకుని.

''చెపితే ఏం? ........''

''తప్పు; చెప్పకూడదు'' అంది ఉష.

''ఏం తప్పు చేశావు అక్కా ?'' అమాయకంగా ఉష కన్నీళ్లు తుడుస్తూ అడిగింది అరుణ.

''మాష్టారు..........'' అంతకన్న ఎక్కువగా చెప్పలేకపోయింది ఉష.

''మాష్టారు తిట్టారా ?'' అంది అరుణ.

ఆ చిన్న మనస్సులో అంతకన్నా ఎక్కువగా ఆలోచనలు రాలేదు.

''అదికాదు....... మాష్టారు...... నన్ను పెళ్లి చేసుకోనన్నారు.'' చెల్లెల్ని దగ్గరగా తీసుకుంటూ అంది ఉష.

''ఓస్ ! ఈమాత్రం దానికే! ఆయన కాకపోతే ఇంకొకరు'' అంది అరుణ ఇదీ ఒక సమస్య కాదన్నట్లు.

''నా బాధ నీకు అర్థం కాదే. అందుకే నీకు అర్థంచేసుకునే వయస్సు లేదన్నది.'' చెల్లెలి అమాయకత్వానికి ఇంతకన్నా ఎలాచెప్పాలో తెలియలేదు ఉషకు.

ఇంకా ఎక్కువగా ప్రశ్నలడిగి అక్కయ్యను విసిగించటం ఇష్టంలేక మాట్లాడక అక్కయ్య హృదయంలో చోటు చేసుకుంది. అరుణ చెల్లెలి అమాయకత్వానికి ఏంచేయాలో ఎలా చెప్పాలో అర్థంకాక అరుణ తలని నిమురుతూ నిదురించింది ఉష.

అక్కయ్య అనురాగం, ఆవేదన, కన్నీళ్లు ఒక్కసారి జ్ఞాపకానికి వచ్చి ఏం చదవటానికి మనస్కరించక ఆలోచిస్తూ కూర్చుంది అరుణ. ప్రొద్దునే అక్కయ్య మొహం లీలగా మెదిలింది అరుణ మనస్సులో. కళ్లన్నీ వాచి, ఎర్రబడి కన్నీటి చారలు బుగ్గలమీద కనపడేటప్పటికి అరుణ మనస్సు అంతా వికలమైపోయింది. ఉషమీద జాలితో అరుణ హృదయం జలదరించింది. దీనికంతకూ కారణం మాష్టారు అనే విషయం ఆ చిన్న హృదయంలో నాటుకుపోయింది. ఒక్కసారి మాష్టరును నమిలి మింగేయాలన్నంత కోపం వచ్చింది అరుణకు. అందుకే ఆమె కోపంతో ఏదో అడగాలని అక్కయ్య ఆవేదనకు కారణం తెలుసుకోవాలని అత్రుతగా ప్రైవేటుకు వచ్చింది. అరుణ. కాని ఆయన ప్రశాంత ముఖం చూసేటప్పటికి ఏం మాట్లాడలేక, ఏం అడగలేక, ఆయన మొహంలోకి చూస్తూ కూర్చుండిపోయింది.

అరుణ ప్రశ్నలతో ఆనందరావు గత జీవితం కూడ తలచి [illegible] ఉరకలేకపోతున్నాడు. ఏ పరిస్థితులలో ఇక్కడకు చేరింది. ఏలాంటి పరిస్థితులు ఎదుర్కోవలసి వచ్చింది అనేది ఆలోచిస్తున్నాడు....

రావు జీవితంలో తల్లితండ్రుల ప్రేమకు నోచుకోలేదు. అసలు ప్రేమ అలా ఉంచి, వాళ్లు ఎలా ఉంటారు. అనేది వూహకు అందని వయస్సులోనే దూరంచేసుకున్నాడు. అతని జీవితమంతా మేనమామ ఇంటిదగ్గరే గడచింది. అత్తయ్య, మామయ్య సరస్వతి, తప్ప ఎవరూ తెలియదుకూడదు. అయిష్టంగానే జీవితంలో ఆశ, ఆదరణ, అనేవి తెలియకుండానే అతని జీవితం గడచిపోయింది. అతని నిరాశ జీవితంలోను, జీవితంలో అతను చెప్పుకోదగ్గ ఆశారేఖ సరస్వతి. మమకారం, ఆదరణ, జాలి అనే పదాలకు అర్థం సరస్వతి. ఆ ఇంట్లో అతని జీవితం ఎంత యాంత్రికంగా ఉన్నా అతని గురించి ఎవరూ పట్టించుకోకపోయినా, సరస్వతి ఆదరణ, 'బావ' అనే తియటి పిలుపూ ఎప్పుడూ అతని చెవులో గింగురుమంటూ ఉండేవి. తనకన్న నాలుగు సంవత్సరాల చిన్నదైన సరస్వతిలో, ఆమె తల్లిలోనే లేని లక్షణాలు ఎలా వచ్చాయో అనేవి పెద్ద సమస్య అయి కూర్చుంటుంది రావుకి. జీవితం నిర్లిప్తంగా గడిపేవారు ఎవరు? అంటే దానికి రావే తార్కాణం. బ్రతకాలనే ఆశ. చావాలనే నిరాశ కూడ ఎరగనివాడు ఆనందరావు. అలాగే అతని మామయ్య ఆదరణ అనందం, లేక సరస్వతి మమకారం అనండి. ఏది ఏమైనప్పటికి ఆనందరావుకు ఒక డిగ్రీ అనేది అంటగట్టి తన బరువు బాధ్యతలు తీరినట్లుగా హాయిగా ప్రశాంతంగా గాలి పీల్చుకున్నాడు వాళ్ల మామయ్య. అతని అత్తయ్య మొదటి నుండి ఆనందరావును మేనల్లుడుగా ఏనాడూ చూడలేదు. అనాధగా, కాస్త జాలిచూపి అంతంత మాత్రంగానే చూస్తూ తన భారం తీరినందులకు ఒక్కసారి వూపిరి పీల్చుకోగలిగింది. అలాగని ఆనందరావుకు అతని మేనమామ, అత్తయ్యమీద కోపం ఉందా అంటే అదీలేదు. వూళ్లో వాళ్లు ఏమంటున్నా 'మేనల్లుడిమీద ప్రేమకాదు ఆయన చదివించింది అతని ఆస్తిమీద ప్రేమ' అనే మాటలు అతను వినటం తటస్థించినా, ఎన్నడూ అతని ఆస్తి వివరాలుగాని, అతని తల్లిదండ్రుల గురించి గాని, అతనికి వూహ తెలుసున్న తరువాత అడిగిన పాపాన పోలేదు. అతను ఇంతకాలం జీవించగలిగాడంటే దీనికి సరస్వతి ఆదరణ, జాలే కారణం. ఆమె హృదయంలో ఏం దాగిఉందో! అనేది ఎప్పుడు తలచి చూడనే లేదు. ఆనందరావు వయస్సు పెరిగిన కొద్దీ వూహాలు ఆశయాలు పెరగటం, వయస్సుతోటే వస్తాయనే సత్యాన్ని మరిచాడు ఆనందరావు. తను జీవితంలో ఆశించనిది, వూహ కందని ఆమె ప్రేమ, ఆదరణ, తనను ఇంటినుండి దూరం చేసింది అనేది అతను వుహించటంలో పొరపాటు లేదు. ఏం జరిగి దూరమై.....

''బావా, నేను సుఖపడటం నీ కిష్టమేనా ?''

''అదేం ప్రశ్న సరూ !''

''ఐతే .. నన్ను పెళ్లి చేసుకోవటానికి నీ అభ్యంతరం ఏమిటి ?'' చాల సూటిగా అడిగింది సరస్వతి.

''పెళ్లా ! .... నిన్నా ! ...'' అన్నాడు ఆనందరావు ఏం మాట్లాడాలో అర్థంకాక. తడబడుతూ ఇలాంటి ప్రశ్న [illegible] వూహించిఉంటే ఏదో సమాధానం చెప్పగలిగి ఉండేవాడు.

''అయితే బావా! నన్ను చేసుకోవటం నీ కిష్టం లేదూ ?'' చాల ముక్కు సూటిగా అడిగింది సరస్వతి.

''అది కాదు సరూ! మామయ్య, అత్తయ్య?'' ప్రశ్నార్థకంగా చూశాడు సరస్వతి మొహంలోకి.

''నేను ఒప్పిస్తాను బావా !'' చాల ధీమాగా మాట్లాడింది సరస్వతి.

ఆమె మాటలనుబట్టి, వాళ్లెంత సుముఖంగా ఉన్నారో ! అర్థమైంది ఆనందరావుకు. కర్తవ్యం ఏమిటో బోధపడలేదు ఆనందరావుకు.

''సరూ ! నన్ను చేసుకుని ఏం సుఖపడతావు ?... నా కన్న మంచివాళ్లు దొరకాలే .... నా ఉద్దేశ్యం ఏమంటే ....''

''ఇష్టంలేదంటే .... లేదని చెప్పకూడదూ !... నీకు హృదయముంది బావా ! దానికి నన్ను అర్థం చేసుకునే శక్తి కూడ ఉంది.''

ఇంతలో అతని మామయ్య రావటంతో ఆ సంభాషణ అంతటితో ఆగిపోయింది. మామయ్య ఆ సంభాషణ పూర్తిగా విన్నారని దానికి కాసేపు తార్కాణం సాయంత్రం భోజనాల దగ్గర తేలిపోయింది ఆనందరావుకు. ఎప్పుడూ మాట్లాడని మామయ్య ....

''ఒరే ఆనందం ! చిన్నతనంలో మాకీ కథ చెప్పుతుండేవారురా .... అదే పాము—బాటసారి కథ .... నీకు జ్ఞాపకముందికదూ !''

ఎంత లౌకికుడు అతని మామయ్య అనటానికి ఇంతకన్నా నిర్ధారణ అనవసరం. అమాత్రం దానిలో ఇమిడిఉన్న భావం అర్థంచేసుకోలేనంత అమాయకుడుకాడు ఆనందరావు.

'నేనంత నీచుణ్ణికాదు మామయ్యా' అని చెప్పాలనుకున్నాడు రావు. సరస్వతి అర్థంకాని చూపులు చూడటంవల్ల, పాపం ! ఆ అమాయకురాలికి ఎంత ఆలోచించినా దాని అర్థం బోధపడలేదు. అతను చెప్పాలనుకున్న మాటలు గొంతుకలోనే ఉండి పోయాయి, సరస్వతి చూసేటప్పటికి.

రాత్రంతా ఎంత ఆలోచించినా తేలని సమస్య అయింది ఆనందరావుకు. ఎటూ తేల్చుకోలేని పరిస్థితి. సరస్వతి దూరంగా పోయి తను బతికలేనేమోనని అనుమానం. మామయ్య మాటలు ములుకుల్లా బాధిస్తున్నాయి. ఎటూ తేల్చలేక కన్నీళ్లను అదుపుకుంటూ ఈ పరిసరాలను విడిచిపెటితే... అనేది అతను ఆలోచించకుండా ఉండలే పోయాడు. ఆఖరికి అదే మంచిదిగా తోచింది ఆనందరావుకు. ఎందుకో సరస్వతి జాలి మొహం తనని వేడుకుంటున్నట్లు 'నన్ను అన్యాయం చేస్తావా బావా !' అంటున్నట్లు భ్రమపడ్డాడు ఆనందరావు సరస్వతి జ్ఞాపకానికి రాగానే కాగితం, కలం తీసుకున్నాడు రావు

సరూ !

నీ జాలి, ఆదరణకు దూరంగా పోతున్నా సరూ ! నీ ప్రేమను, నీ త్యాగాన్ని అర్థంచేసుకోలేని [illegible] మూర్ఖుణ్ణికాదు—కానీ [illegible] తల్లి పాలు పోసి పెంచిన మామయ్య, అత్తయ్యలకు ఎవరు


MONARCH
కేవలము పురుషులకు

పెళ్ళిలేని పరిస్థితులలో నీ కోరిక చెల్లించలేని నిర్భాగ్యుణ్ణి— ఒకవేళ నీవు బలవంతంగా పరిస్థితులకు ఎదురీది నన్ను పెళ్ళిచేసుకున్నా నీలో ఉండేది జాలి ! ఏదో త్యాగం చేసాననే సంతృప్తికదూ ! మావయ్య ఉదాహరణ ఇప్పటికైన అర్థమైంది కదూ ! నేను ఊహించనిది నీ మమతా, ప్రేమ నన్ను మీ ఇంటినుండి దూరంచేస్తాయని ! నేను అశక్తుడ్ని సరూ !— నీ సుఖాన్ని కోరి—నీ వంశ గౌరవాన్ని నిలబెట్టాలని నేనెంత త్యాగం చేస్తున్నానని తలంచటంలేదు. మీకు నేనెంత దూరంగా ఉంటే సమస్యలు అంత తేలికగా పరిష్కారమవుతాయని పోతున్నాను—నేను పిరికివాడిని —

నీ ప్రేమను, ఆదరణను మరువలేని,

'రావు.'

ఉత్తరాన్ని పూర్తిచేసి, ఆఖరుసారి అమాయకంగా నిదురించే సరస్వతిని ఒదలలేక, చేతిసంచిలో నాల్గు బట్టలు కుక్కుకుని, మావయ్య అత్తయ్యను కడసారి చూస్తూ ఆ ఇంటినుండి బయటి ప్రపంచంలోకి అడుగుపెట్టాడు రావు. వచ్చేముందు మావయ్య చూసినా చూడనట్లు మగతగా పడుకోవడం అతను చూడకుండా పోలేదు. ఇంటి దగ్గరనుండి పిరికిగా, పరిస్థితులకు ఎదురాడలేక పారిపోయి వచ్చినప్పుడు ఎంత నిరాశ మనస్సులో ఆవరిస్తున్నా, ఆశ అనే కోరికను పూర్తిగా చంపుకోలేకపోయాడు ఆనందరావు. నాల్గు, అయిదు రోజులు తిరిగి, విసిగి వేసారి, ఏ ఉద్యోగం కూడా సంపాదించలేకపోయాడు ఆనందరావు. అతని డిగ్రీ అతన్ని వెక్కిరిస్తూంది అతని అప్రయోజకత్వాన్ని చూసి !. చూచాయగా ఎవరో చెప్పిన మాటను త్రోసిపుచ్చలేక ఇదే ఇంటికి ఏ పరిస్థితులలో వచ్చాడో ఇప్పుడు తలుచుకుంటే అతని హృదయం ఒక్కసారి గగుర్పాటు చెందింది. సంస్కారంలేని జుత్తు, పెరిగిన గెడ్డం, మాసిన బట్టలు, దీన తిదీనమైన చూపులతో ఆనందరావు ఈ ఇంటికి మొదటిసారి వచ్చాడు. చూడగానే ముందు తిరస్కరించినా తరువాత జాలిపడి వారి అమ్మాయిలకు ప్రయివేటు చెప్పటానికి అంగీకరించారు గోపాలరావుగారు.

ఇంతకూ గోపాలరావుగారి గురించి కొద్దిగా చెప్పవలసి ఉంటుంది. కూర్చుని తిన్నా తరగని ఆస్థి గోపాలరావుగారిది. తన రెండు నేత్రాలుగా చూసుకుంటూ ఉంటారు గోపాలరావుగారు. తల్లిలేని కొరతను మరిపించటానికి పిల్లలకు ఏం కావాలన్నా తీర్చటానికి సిద్ధంగా ఉంటారు గోపాలరావుగారు. నమ్మకమైన నౌఖరు వంటమనిషి తప్ప ఆ యింట్లో ఎవరూ లేరు. వూళ్ళో వాళ్ళకు ఆయన ఎంత పట్టుదల నిజాయితీ మనిషో, ఇంట్లో అంత ప్రేమమూర్తి ! ప్రేమతో పెరిగారు ఇద్దరు పిల్లలు. పెద్దమ్మాయి ఉష పదహారు సంవత్సరాల కన్నెపడుచు. లోకాన్ని అర్థంచేసుకుని ఆకళింపు చేసుకొనే వయస్సు ఆమెది. పరిటిస్థితులు, స్థితిగతులు చెప్పకపోయినా చూసి తేలికగా తెలుసుకోగలదు. ఇంక రెండో అమ్మాయి అరుణ చిలిపితనం ఎప్పుడూ కళ్ళలో తొణికిసలాడుతూ ఉంటుంది. జీవితంలో సుఖాన్ని తప్ప దుఃఖం ఎలా ఉంటుందో ! అనేది ఆమెకు తెలియదు. ఎప్పుడూ చలాకీగా నవ్వుతూ, త్రుళ్ళుతూ ఆడుకుంటూ ఉంటుంది. పెద్ద అమ్మాయిని మెట్రిక్, చిన్న అమ్మాయిని ప్రీ మెట్రిక్ చదివించాలనే ఉద్దేశంతోనే మాష్టారుని ఏర్పాటుచేసారు గోపాలరావుగారు. ఇదివరలో ఏర్పాటుచేసిన మాష్టారు అకస్మాత్తుగా ట్రాన్స్‌ఫర్ కావటంతో ఆనందరావుని చూసి అతను వయస్సులో ఉన్నా, అతని పరిస్థితులు అర్థంచేసుకుని జాలితో అమ్మాయిలకు ప్రవేటు చెప్పటానికి అంగీకరించారు గోపాలరావుగారు. కాని, అంగీకరించే ముందు ఒక షరతు కూడ పెట్టారు ఆయన. రెండు రోజులు చెప్పిన తరువాత అమ్మాయిలకు ఇష్టంలేకపోతె మాన్పించివేస్తానని. అదే షరతుకు ఆనందరావు కూడా అంగీకరించాడు.

# పిరికివాడు

మొదటిరోజు హృదయాన్ని చిక్కబట్టుకుని బయలుదేరాడు రావు. అందులో అతనికి మొదటిసారి, అది కాకుండా అమ్మాయిలకు చెప్పటం, మనస్సులో భయం ఆ పీకుతున్నా ఒక్క ఆధారం పోతుందేమోననే నిరాశతో వెళ్ళి కూర్చున్నాడు. అతనికి ఎదురుగా, అణుకువగా పుస్తకాలు ముందేసుకుని కూర్చున్నారు ఇద్దరు అమ్మాయిలు.

''అక్కా ! చూడవే మన క్రొత్త మాష్టారు.'' అంది అరుణ, ఉషతో మెల్లగా.

ఉష ఒక్కసారి కళ్ళెత్తి చూసి తల దించుకుంది.

''ఇదివరకు మాష్టారిలా లేరే అక్కా .... ఏం బాగుండలేదు.'' అంది అరుణ ఉష చెవులో [illegible]

ఈ మాటలు కూడ రావుగారు వినకుండా పోలేదు. ఉష కళ్ళలోనే చెల్లెల్ని వారించటం కూడా రావు కంటబడ్డాయి. కాని, అరుణ కళ్ళలో, నిరాశ, అసంతృప్తి స్పష్టంగా కనిపిస్తున్నాయి.

''మాస్టారు బాగుండలేదక్కా .... మాటలు రావేమో ! ఇలా అయితే నాన్నగారితో చెప్పేస్తా మనకు వద్దని.'' ఈసారి కాస్త గట్టిగానే అంది అరుణ రావుకు కూడ వినపడేటట్లు.

ఒక్కసారి రావు హృదయాన్ని చిక్కబట్టుకుని తన భయాన్ని కప్పిపుచ్చుకునేలా ప్రయత్నిస్తూ, ముందున్న కర్తవ్యాన్ని దృష్టిలో ఉంచుకుని మరీ మొదలుపెట్టాడు.

''చూడండి ... నీపేరేం పాపా ? ....'' అన్నాడు రావు తడబడుతూ చిన్నమ్మాయిని చూస్తూ.

''నా పేరు పాప కాదు అరుణ ....మా అక్కయ్య ఉష మెట్రిక్‌కు కడుతూంది.'' అంది గర్వంగా అరుణ తన అక్కయ్యకేసి చూస్తూ.

''చూడండి .... నాకు క్రొత్త అయినా మీకు జాగ్రత్తగా చెప్పటానికి ప్రయత్నిస్తాను'' అన్నాడు రావు నెమ్మదిగా.

అతని తడబాటు చూసి నవ్వకుండా ఉండలేకపోయింది అరుణ. ఉష విదిలింపుతో కాస్త సద్దుకు కూర్చుంది. పరిస్థితులు వూహించనివిగా తయా

33 వ పేజీ చూడండి




“ఎలక్ట్రిసిటీవాళ్ళధర్మమా”అని కరెంటుపోయినప్పుడల్లా నాకొవ్వొత్తులవ్యాపారం బ్రహ్మాండంగా సాగుతోంది.

27-11-1964 శుక్రవారము నుండి
3-12-1964 గురువారము వరకు.

**మేషం :**

(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)

ఆదాయం మామూలుగానే ఉన్నా వృత్తి వ్యాపారాల్లో మీ ప్రయత్నాలు విశేషమైన శ్రమ లేకుండా నెరవేరడంవలన ఈవారం సంతృప్తికరంగానే ఉంటుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలకంటే స్వంతంగా చేసే వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు అంతగా ఫలించకపోవచ్చును. వృత్తిలో శ్రమకు తగిన ప్రతిఫలాన్ని పొందగలరు. ఉద్యోగంలో మీ పరిస్థితి యధాతథంగా ఉంటుంది. మీ ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది గాని సంతానానికి కించిదనారోగ్యం చేయువచ్చును. బంధువులతో భేదాభిప్రాయాలు రాగల సూచనలు ఉన్నాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయుటానికి అవకాశం ఉంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు యిదివరకటి కంటె బాగా ఉంటాయి. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**వృషభం :**

(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగ 1, 2 పా.)

వృత్తి వ్యాపారాల్లో ఏ వ్యవహారానికైనా పూనుకోవడం కంటే పూరుకోవడమే ఉత్తమంగా ఉండే పరిస్థితి ఏర్పడుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. వ్యాపారంలో మీరు ఇదివరకు జరిపిన వ్యవహారాల్లో చికాకులు రావడంవలన ఆందోళన కలుగుతుంది. ఉద్యోగంలో మీరు ఎంత మంచిగా ప్రవర్తించినా, అది ఇతరులకు చెడుగానే కన్పిస్తుంది. వృత్తిలో అననుకూలమైన వార్తలను వింటారు. ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల బలం పెరగడం వలన మీ కార్యక్రమాలను పునరాలోచన చేయువలసి వస్తుంది. ప్రేమ వ్యవహారాల్లో భేదాభిప్రాయాలు రావచ్చును.

స్త్రీలకు—మీ ఆరోగ్యం బాగానే ఉంటుంది కాని సంతానానికి అనారోగ్యం చేయువచ్చును. పుణ్యకార్యాలు చేస్తారు.

**మిథునం :**

(మృగశిర 3, 4 పా, ఆర్ద్ర, పునర్వసు, 1, 2, 3 పా.)

గ్రహబలం అనుకూలంగా ఉంది. వృత్తి వ్యాపారాల్లో మీ ప్రయత్నాలు ఫలించడంవలన కేవలం ఆర్థిక ప్రయోజనమే కాకుండా సాటివారిలో మీ సమర్థత రుజువు కాగలదు. దీర్ఘకాలానికి ఫలితాన్ని యిచ్చే భారీ ప్రయత్నాలలో మీ ఆలోచనలకు అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి. వృత్తిలో నూతన మార్గాల ద్వారా ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో మీరు కోరే మార్పుల విషయంలో అధికారుల తోడ్పాటు లభించవచ్చును. వ్యర్థమైన వాద ప్రతివాదాల్లో చిక్కుకొని ఇటువంటి అమూల్యమైన కాలాన్ని వ్యర్థం చేసికొనే ప్రమాదం ఉంది. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉన్నా కొంచెం బలహీనత కన్పించవచ్చును. అధిక వ్యయం జరుగుతుంది. అలంకార వస్తువులు కొంటారు.

| | | | |
|---|---|---|---|
| | గు | | రా |
| శ | వారఫలం | | |
| | మహేష్ | | చం కు |
| బు కే | ర | శు | |

**కర్కాటకం :**

(పునర్వసు 4 పా, పుష్యమి, అశ్లేష.)

ఈ వారం ఆర్థికంగా, సామాన్యంగా ఉన్నా అన్ని వ్యవహారాల్లోను గౌరవం బాగా ఉంటుంది. ఇతరులను మెప్పించడానికి మీరు సందేహించడం వలన వ్యాపారంలో మీరు కొన్ని అనవసరమైన వ్యయప్రయాసలకు గురికావలసి వస్తుంది. వృత్తిలో ముందు ఉపయోగించగల మార్పులు రావచ్చును. ఉద్యోగంలో మీ కార్యక్రమాలన్నీ ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. కోర్టు వ్యవహారాల్లో ఆకస్మికంగా కొన్ని అనుకూలమైన సంఘటనలు జరగవచ్చును. ఆరోగ్యం బాగా ఉన్నా శరీర శ్రమతో కూడిన కార్యక్రమాలు పనికిరావు. సాంఘిక వ్యవహారాల్లో నూతన గౌరవాన్ని పొందగలరు. సాహిత్య కళారంగాల్లో కృషిచేయువారికి యోగవంతమైన సమయం.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో కొన్ని మార్పులు రావచ్చును. పొరుగువారిలో పలుకుబడి లభిస్తుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**సింహం :**

(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)

ఈ వారం గత వారం కంటే బాగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో ఉత్సాహకరమైన సంఘటనలు జరగవచ్చును. వ్యాపారం భారీ ఎత్తున చేయడం వల్ల పెట్టుబడి చాలక అప్పుడప్పుడు తొట్రుపాటు కలగగల సూచనలు ఉన్నాయి. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ప్రయాసకు తగిన ప్రయోజనం ఉండకపోవచ్చును. వృత్తిలో ప్రయాణము ద్వారా మిక్కిలి కష్టం మీద కార్యసాధన చేయగలరు. ఉద్యోగరీత్యా మీరు చేయువలసిన ముఖ్యమైన నిర్ణయాలు వారం మధ్యలో చేయడం మంచిది. స్థిరాస్తి వ్యవహారాలు చాలా ప్రోత్సాహకరంగా ఉంటాయి. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉండకపోవచ్చును. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**ఈవారం ధరలు**

అపరాల ధరలు కొంచెం తగ్గడానికి అవకాశం ఉంది. నూనె ధరలో ఒడుదుడుకులు రావచ్చును. బెల్లం ధర వారాంతంలో తగ్గవచ్చును. పసుపు ధర కొంచెం పెరుగుతుంది. బట్టల ధరలు స్థిరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్య విషయంలో జాగ్రత్త అవసరం. బంధువుల వ్యవహారాల్లో అననుకూలమైన వార్తలను వింటారు. ప్రయాణాలను వాయిదా వేయడం మంచిది.

**కన్య :**

(ఉత్తర 2, 3, 4 పా, హస్త, చిత్త 1, 2 పా)

వృత్తి వ్యాపారాల్లో ఆదాయం కొద్దిగా పెరిగినా మీరు పొందిన వ్యయప్రయాసలతో పోల్చినప్పుడు ఈ వారం అంత సంతృప్తికరంగా కన్పించకపోవచ్చును. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాల్లో భేదాభిప్రాయాలు రావడంవలన కొన్ని ముఖ్యమైన వ్యవహారాలు విడిచి పోగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో కొన్ని అవకాశాలు ఇంద్రజాలం వలె కన్పిస్తాయి గాని అవి కార్యరూపాన్ని ధరించడం చాలాకష్టం. ఉద్యోగంలో ఇతరులు చేసిన పొరపాట్లకు కూడా మీరే బాధ్యతవహించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. డబ్బు ఇచ్చి పుచ్చుకోవడాల్లో చికాకులు రావచ్చును. ఆరోగ్యం ప్రస్తుతం బాగా ఉన్నా నిర్లక్ష్యం చేయుతగదు. రాజకీయ వ్యవహారాలు కొంతవరకు బాగానే ఉంటాయి.

స్త్రీలకు— ఆరోగ్యం సాధారణంగా ఉంటుంది. వినోదకార్యక్రమాల్లో పాల్గొంటారు.

**తుల :**

(చిత్త 3,4 పాదాలు, స్వాతి, విశాఖ, 1,2,3 పా)

వృత్తి వ్యాపారాల్లో మీరు ఘన విజయాల్ని ఏమీ సాధించలేక పోయినా మీరు తలపెట్టిన కార్యక్రమం అంతా సక్రమంగా నెరవేరడం, ఈ వారం బాగానే ఉందని సంతృప్తి లభిస్తుంది. భారీ ఎత్తున చేసే వ్యాపారాల్లో ఎన్నో ఇబ్బందులను ఎదుర్కొన్న తరువాత కొంత అభివృద్ధిని సాధించగలరు. ఆర్థిక వ్యవహారాలు ఇదివరకటికంటె బాగా ఉంటాయి కాని రావలసిన డబ్బును నమ్మి నూతన వ్యవహారాలు ప్రారంభించడం మంచిది కాదు. వృత్తిలో మీ పరిస్థితి సంతృప్తికరంగా ఉంటుంది. ఉద్యోగంలో అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో ఇదివరకు ఏర్పడిన భేదాభిప్రాయాలు చాలవరకు తొలగి పోతాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో చికాకులు రావచ్చును. బంధువులకు సహాయం చేస్తారు.

### వృశ్చికం :

(విశాఖ 4వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

ఇంతవరకు చికాకులతో ఉన్న వ్యవహారాలు మీకు అనుకూలంగా పరిష్కారం కావడం వలన వృత్తి వ్యాపారాల్లో ముఖ్యమైన వ్యవహారాల మీద దృష్టిని కేంద్రీకరించడానికి అవకాశం లభిస్తుంది. వ్యాపారంలో మిమ్మల్ని ఎదురుగా పొగడుతూ చాటున దూషించే వ్యక్తులతో వ్యవహరించవలసి వస్తుంది. మీకంటే తక్కువ వారివల్ల వ్యాపారం ప్రయోజనాన్ని పొందగలరు. వృత్తిలో మీ అభిప్రాయాలను అమలు జరపడానికి అవకాశం అందువల్ల అధికాదాయం కూడా లభించగలవు. ఉద్యోగంలో మీ పరిస్థితి బాగానే ఉంటుంది. మీ స్వంత వ్యవహారాల్లో కంటే ఇతరుల వ్యవహారాల్లో శ్రమ అధికంగా ఉంటుంది. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది.

స్త్రీలకు— సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. శుభకార్యాల విషయంలో అనుకూల వార్తలను వింటారు.

### ధనుస్సు :

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

కార్యసాధన కోసం మీరు కొంతమంది అవాంఛనీయులైన వ్యక్తులకు సన్నిహితంగా ప్రవర్తించడం వలన మీ మిత్రులే మిమ్మల్ని అపార్థం చేసుకొనే ప్రమాదం ఉంది. వృత్తి వ్యాపారాల్లో అభివృద్ధిని సాధించడానికి అవకాశం ఉంది కాని మీరు ఇదివరకు ప్రారంభించిన వ్యవహారాల్లో అధిక వ్యయం జరగడం వలన ఆర్థికంగా తాత్కాలికమైన తొట్రుబాటు కలగగల సూచనలున్నాయి. ఉద్యోగంలో మీ కార్యక్రమం అంతా మీరు వూహించినట్లుగానే జరిగిపోతుంది. కోర్టు వ్యవహారాల్లో ప్రతి పక్షాలు బలహీనపడడం వలన మీ వాదానికి బలం చేకూరుతుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. ప్రేమ వ్యవహారాల్లో నూతనోత్సాహం కలిగే సంఘటనలు జరగవచ్చును.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. బంధువులతో ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగి పోగల సూచనలు ఉన్నాయి.

### మకరం :

(ఉషా 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1,2 పా.)

ఆర్థికంగా అప్పుడప్పుడు కొద్ది చికాకులు కలగవచ్చును. గాని వృత్తి వ్యాపారాల్లో మీరు చేస్తున్న ఆలోచనలను అమలులోనికి తేవడానికి అనువైన అవకాశాలు లభించడం వలన ఈ వారం సంతృప్తికరంగా ఉంటుంది. వృత్తిలో పోటీవారితో పోటీ చాలవరకు తగ్గుతుంది. భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలకంటే స్వంతంగా చేసే వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు సమయానికి అందక ఒత్తిడి రావచ్చును గాని కొంత మంది మిత్రుల తోడ్పాటు లభించడంవలన అన్ని కార్యక్రమాలను సక్రమంగా నెరవేర్చగలరు. ఉద్యోగంలో అనవసరంగా కొన్ని అపోహలకు మీరు గురి కాగలరు కాని తరువాత నిజం తెలియడం వలన ఇతోధికమైన మంచి పేరు పొందగలరు. ఆరోగ్యం బాగానే ఉంటుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉన్నా అప్పుడప్పుడు మానసికాందోళన కలగవచ్చును. కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది.

### కుంభం :

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భా. 1, 2, 3పా)

వృత్తి వ్యాపారాల్లో కొన్ని చికాకులు కలిగేట్లు కన్పిస్తాయి గాని మీరు చాకచక్యంతో వ్యవహరించడం వలన వాటిని అధిగమించడానికి అవకాశం ఉంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాల్లో ప్రయాసకు తగిన ప్రయోజనం ఉండక పోవచ్చును. వృత్తిలో కొంతమంది వ్యక్తులు మీకు ఆశలు చూపించి మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. సాహసముతో కూడిన వ్యవహారాలు వారాంతంలో లాభించగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో పై అధికారులతో భేదాభిప్రాయాలు తలయెత్తవచ్చును. ఆరోగ్యం బాగానే ఉంటుంది. రాజకీయ వ్యవహారాల్లో మీ ఆలోచనలు అంతగా ఫలించక పోవచ్చును. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది.

స్త్రీలకు— ఆరోగ్యం గత వారంలో కంటే బాగా ఉంటుంది. పోటీ వారితో మాట పట్టింపులు రావచ్చును. అలంకార వస్తువులు కొంటారు.

### మీనం :

(పూ. భాద్ర, 4 పా, ఉ. భా. రేవతి.)

ఈ వారం సామాన్యంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీరు చేసే భారీ ప్రయత్నాల్లో విశేషమైన వ్యయప్రయాసలతోను మిత్రుల సహకారంతోను కొంత అభివృద్ధిని సాధించ గలరు. ఆదాయం మామూలుగానే ఉన్నా, ఏదో ఒక విధంగా డబ్బు ఎప్పుడూ చేతిలో ఉండడం వలన అన్ని వ్యవహారాలు ఇబ్బందులు లేకుండా జరిగి పోతాయి. వృత్తిలో పోటీవారితో పోటీ కొంచెం పెరగవచ్చును గాని దానివల్ల మీ కార్యక్రమాలకు ఆటంకం కలగదు. ఉద్యోగంలో మీ పరిస్థితి సాధారణంగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు జరగవచ్చును. ఆరోగ్యం సంతృప్తికరంగా ఉంటుంది. రాజకీయవ్యవహారాల్లో ఇదివరకు చేజారిపోయిన అవకాశాలు తిరిగి లభిస్తాయి.

స్త్రీలకు— ఆరోగ్యం బాగానే ఉంటుంది. బంధువుల వ్యవహారాల్లో అనుకూలవార్తలను వింటారు. అధిక వ్యయం జరుగుతుంది. ★

## జన్మదినఫలం

### నవంబరు-27

కొన్ని వ్యవహారాల్లో మీరు మొదట వేసిన అంచనాకంటే అధికంగా వ్యయం చేయవలసిన పరిస్థితి ఏర్పడినా, వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా సాగిపోవడం వలన మొత్తంమీద యీ సంవత్సరం సంతృప్తికరంగానే ఉంటుంది. వ్యాపారంలో విశేష ప్రాబల్యం గల వ్యక్తుల అండదండలు మీకు లభించడంవలన యిదివరకు అసాధ్యం అనుకొన్న వ్యవహారాలు కూడా ఇప్పుడు నెరవేరగల సూచనలు ఉన్నాయి. వృత్తిలో నూతనావకాశాలు లభించడంవలన ఆదాయం పెరుగుతుంది. ఉద్యోగంలో అనుకూలమైన స్థానమునకు మార్చబడగల అవకాశం ఉంది. స్థిరాస్తి వ్యవహారాల్లో ఏర్పడిన చికాకులు తొలగిపోతాయి. గృహనిర్మాణాది ప్రయత్నాలు చురుకుగా సాగుతాయి. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

### నవంబరు-28

వృత్తి వ్యాపారాల్లో మీరు తగినంత అభివృద్ధిని సాధించగల సూచనలు ఉన్నాయిగాని పరిస్థితుల ప్రాబల్యంవలన కొంతమంది సన్నిహితులకే దూరంకావలసిన స్థితి ఏర్పడడం వలన ఈ సంవత్సరం అంత సంతృప్తికరంగా కన్పించక పోవచ్చును. భారీయెత్తున చేసే వ్యాపారాలు మొదట అంత ప్రోత్సాహకరంగా ఉండకపోయినా. రానురాను మీ కృషి ఫలించడానికి అవకాశం ఉంది, వృత్తిలో మీకు ముందుముందు ఉపయోగించగల ఏర్పాట్లు, ఒప్పందాలు మొదలైనవాటిలో అనుకూలమైన మార్పులు జరగగలవు. ఉద్యోగంలో అధికారులతో భేదాభిప్రాయాలు రావచ్చునుగాని మీ అభిప్రాయాలే సరియైనవని తరువాత రుజువు కావడంవలన యితోధికమైన గౌరవాన్ని పొందగలరు. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు బాగానే ఉంటాయి. విద్యార్థులు కొంచెం శ్రమమీద కృతార్థులు కాగలరు.

### నవంబరు-29

ఈ సంవత్సరం శుభాశుభ మిశ్రమంగా ఉంటుంది. వృత్తి వ్యాపారాల్లో మీ కృషి ఫలించి ఆదాయం పెరగడానికి అవకాశం ఉంది కాని సంవత్సరం మధ్యలో ఆకస్మికంగా కొన్ని చిక్కులు ఏర్పడి వ్యయప్రయాసలకు గురికావడంవలన అంతవరకు మీరు సాధించిన అభివృద్ధి వ్యర్థం కాగల ప్రమాదం ఉంది. ముఖ్యమైన వ్యవహారాలు భాగస్వాముల నిర్ణయానికే విడిచిపెట్టడం మంచిది. వృత్తిలో సంవత్సరాంతంలో అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. ఉద్యోగములో స్థానచలనము కలగవచ్చును. కాని దానివల్ల మీరు పొందే లాభనష్టములేమీ ఉండక పోవచ్చును. ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాల్లో యిదివరకు ఏర్పడిన భేదాభిప్రాయాలు తొలగిపోతాయి. శుభకార్యాల విషయంలో అభివృద్ధి ఉంటుంది. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యార్థులు సామాన్యంగా కృతార్థులు కావచ్చును.

### నవంబరు-30

ఈ సంవత్సరం ఆర్థికంగా బాగా ఉన్నా ఏదో ఒకవిధంగా ఎప్పుడూ ఆందోళన కలిగించే పరిస్థితులు ఏర్పడుతూ ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు సంవత్సరం మధ్యలో లాభించడానికి అవకాశం ఉంది. వ్యాపార విస్తరణ ప్రయత్నాలు సామాన్యంగా ఉంటాయి. వృత్తిలో మీరు ఇదివరకు నిర్లక్ష్యం చేసిన వ్యవహారాలకు యిప్పుడు ప్రాముఖ్యత రావడంవలన కొంత తొట్రుపాటు కలగవచ్చును. ఉద్యోగంలో శత్రువులకంటె మిత్రులవల్లనే అపాయం కలిగే సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మార్పులకోసం ప్రయత్నం చేయ

# జన్మదినఫలం

... కార్య వ్యవహారాల్లో ప్రయాసకు తగిన ఫలితం ఉంటుంది. ఆరోగ్యం బాగానే ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు మాత్రం అంత బాగా ఉండవు. ప్రేమ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. విద్యార్థులు శ్రమమీద కృతార్థులు కావచ్చును.





## డిశంబరు-1

ఈ సంవత్సరం వృత్తివ్యాపారాల్లో మీరు ఘన విజయాల్ని సాధించలేకపోవచ్చునుకాని నిరుత్సాహం పొందవలసిన పరిస్థితికూడా ఏర్పడదు. వ్యాపారంలో మీ కార్యక్రమాలన్నీ మామూలుగా జరిగిపోతాయి. భాగస్వాములతో కలిసిచేసే వ్యాపారాల్లో, భేదాభిప్రాయాలు కలగడంవలన కొన్ని ముఖ్యమైన కార్యక్రమాలు నిలచిపోవచ్చును. వృత్తిలో అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. అధికారుల వలన జరుగవలసిన పనులు సులువుగా నెరవేరి లాభించగల సూచనలు ఉన్నాయి. ఉద్యోగంలో మీరు ఇతరులను నొప్పించడానికి సందేహించడంవలన మీరు పొందవలసిన ప్రయోజనాన్ని పొందలేకపోవచ్చును. ఆర్థిక వ్యవహారాలు సామాన్యంగా ఉంటాయి. ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభకార్యం మూలంగా ధనవ్యయం జరుగుతుంది. విలాస యాత్రలు చేస్తారు. విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

## డిశంబరు-2

ఈ సంవత్సరం అన్నివిధాలా అనుకూలంగా ఉంటుంది. వృత్తివ్యాపారాల్లో మీ ఆలోచనలు ఫలించడంవలన ఆర్థికంగా అభివృద్ధిని సాధించడమేకాకుండా సాటివారిలో గౌరవాన్ని పొందగలరు. భారీఎత్తునచేసే వ్యాపారాల్లో మిత్రుల తోడ్పాటు లభించడంవలన మీరు వూహించినదానికంటే అధికంగా ప్రయోజనాన్ని పొందగలరు. వృత్తిలో నూతనావకాశాలకోసం ప్రయత్నం చేయడంవలన అనవసరమైన ప్రయాసకు గురికాగలరు. కాని సంవత్సరాంతంలో ఆకస్మికంగా అనుకూల పరిస్థితులు ఏర్పడతాయి. ఉద్యోగంలో అనుకూల వాతావరణం ఏర్పడుతుంది. ఉన్నత స్థానం లాభించడానికి అవకాశం ఉంది. ఆరోగ్యం బాగా ఉంటుంది. కుటుంబ వ్యవహారాలు అంత బాగా ఉండవు. సాంఘిక వ్యవహారాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కాగలరు.

## డిశంబరు-3

వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉన్నా కార్యసాధనకోసం మీరు అంతగా ఇష్టంలేని పరిస్థితుల్లో చిక్కుకోనడంవలన ఈ సంవత్సరం అంత సంతృప్తి కల్పించక పోవచ్చును. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగల సూచనలు ఉన్నాయి. వ్యాపారం భారీ ఎత్తున చేయడంవలన పెట్టుబడి చాలక అప్పుడప్పుడు కొద్దిగా ఒత్తిడి రావచ్చును. వృత్తిలో మీరు ఇదివరకు చేసిన ప్రయత్నాలు ఇప్పుడు ఫలించగలవు. ఉద్యోగంలో మీ పరిస్థితి యథాతథంగా ఉంటుంది. ఆరోగ్యం ప్రస్తుతం బాగావున్నా నిర్లక్ష్యం చేయతగదు. కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల్లో పోటీకలు రావడంవలన మీ అభివృద్ధి మార్గం నిష్కంటకం కాగలదు. విద్యార్థులు మంచి మార్కులతో కృతార్థులు కావచ్చును. ★

# హృదయ కుసుమాలు



'హరికిషన్'

### జరిగిన కథ

డాక్టర్ సీత, తన స్నేహితురాలయిన డాక్టర్ రాధకు తమ కుటుంబ గాథను చెపుతూవుంటుంది. ఎన్నెన్నో అపవాదులకూ, నానా అగచాట్లకూ గురి అయిన సీత అక్కయ్య జీవితం విషాదాంతమవుతుంది. ఆ ఇంట మిగిలిన పసివాడు బాబుకు ఆదరణ, బావకు మనశ్శాంతి కావాలి. కాలేజీలో చదువుతున్న సీతను, బావ రామారావునే వివాహం చేసుకోమని ఆమె తలిదండ్రులు అడుగుతారు. కాని ముందు చదువు పూర్తిచేయాలంటుంది సీత. గుంటూరు వచ్చి వెళ్లవలసిందిగా సీతకు ఉత్తరం వ్రాస్తాడు రామారావు. వివాహ విషయంలో ఆమె ఉద్దేశాన్ని తెలుసుకోవాలనుకున్న రామారావుకు తన విముఖతను పరోక్షంగా తెలియజేస్తుంది సీత.

## 16

సోమవారం ఉదయమే ఏలూరు వచ్చేశాను. నాన్న నన్నేమీ అడగలేదు. అమ్మ ఆదుర్దాకు అంతులేదు. నా మనస్సులో ఆందోళనకు అవధులులేవు.

అక్కయ్య సంసార జీవితం తీర్చిదిద్ది ఆదర్శ స్త్రీమూర్తిగా చెయ్యలేకపోయినా, గృహిణిగా దాని కాపురం అది చేసుకుంటూ మానసికంగా ఏ విధంగానూ బాధపడకుండా, సుఖమయ జీవితం గడపాలనే ఆకాంక్షతో బావ ఇంట్లో అడుగు పెట్టాను. అడుగడుక్కీ బావ అక్కయ్యను అనుమానిస్తుంటే ఇద్దరి అభిప్రాయాల్నీ సమన్వయపర్చుకుని బావతో తర్కవాదానికికూడా దిగి అక్కయ్య కాపురం సరిదిద్దబోయాను. ఈ విషయంలో నేను కొంతవరకూ కృతకృత్యురాల్న యినా, బావ దృష్టిలో గడసరిదానిగా చూడబడ్డానో, మంచి చెడ్డలను సమన్వయపరిచి, సూటిగా, నిర్భయంగా మాట్లాడేదాన్నిగా చిత్రించుకోబడ్డానో నా కింతవరకూ నిర్దిష్టంగా తెలీదు. నా మనస్తత్వాలు బావ ఏ విధంగా అర్థంచేసుకున్నా ఒక్కసారి బావ అన్న మాటల్ని తల్చుకుంటే, బావ నన్ను ఏ దృష్టితో తన మనస్సులో నింపుకున్నారో కొంతవరకూ తెల్సుకోగలిగాను. ఒకసారి "సీతా నిన్ను చేసుకునుంటే నన్ను తీర్చిదిద్దుకుని నన్నొక దారిలోకి తీసుకవచ్చేదానివి. కాని......" అంటూ మనస్సులో మాటను ఆపివేశారు. మరోసారి "సీతా, కాబోయే నా తోడల్లుడు చాలా అదృష్టవంతుడు" అన్నారు. ఇవన్నీ తల్చుకుంటే అక్కయ్య బ్రతికున్న రోజుల్లోనే బావ నన్ను మనస్సులోనయినా కాంక్షించారన్నమాట. అక్కయ్యపోయాక బాబు పోషణ భారం వహించటానికిగాని, తను మళ్లీ గృహస్థాశ్రమం స్వీకరించటానికిగాని నన్ను పెళ్లిచేసుకోవాలని నిశ్చయించుకున్నారన్నమాట. అసలు బావ

నన్ను ప్రేమిస్తున్నారా ? పునర్వివాహం పరాయి పిల్లను చేసుకునే బదులు నన్ను చేసుకుంటే బాబు పోషణ విషయంలో ఏ ఇబ్బందులూ ఉండ వనే ఉద్దేశ్యంతో ఈ అభిప్రాయాని కొచ్చారా? తల్లిదండ్రుల ప్రోద్బలం నుంచి వారి మాటను కాదనలేక నన్ను చేసుకోటానికి ఇష్టపడ్డారా ? ఎంత ఆలోచించినా నాకేం అర్థంకాలేదు. రమా దేవిని తల్చుకుంటే చాలా ఆశ్చర్యం కలుగుతున్నది. బాబు పోషణ విషయంలో ఎందుకు శ్రద్ధ తీసు కుంటున్నది ? అక్కయ్య పోయాక వాళ్ళింటికి ఎందుకు వెళుతున్నది. బావ తనను పలకరించక పోయినా, తను వెళ్ళినప్పుడు కన్నెత్తి చూడక పోయినా ఆ కుటుంబానికి, బాబు పోషణ విష యంలో సాయపడుతున్నదంటే, రమాదేవి అంతర్యమేమిటి ? బావను ప్రేమిస్తున్నదా ? బావను కాంక్షిస్తున్నదా ? బావను చేసుకోవా లనుకుంటున్నదా ? అంత ఆస్తిపాస్తులు కలవాళ్ళు, డబ్బు కలవాళ్ళు అయిన రమాదేవి తల్లిదండ్రులు ఇంతకన్నా మంచి సంబంధం తేలేకపోయారా ? అసలీ విషయాలన్నీ వాళ్ళకి తెలుసా ? తెలిసి సార్థించారా ? అంతా ఇష్టపడే ఈ నిర్ణయాని కొచ్చారా ? నాకు ఏమీ తోచలేదు.

ఒక వ్యక్తి చావుతో కుటుంబంలో ఎన్ని మార్పులు, ఎన్ని చీలికలు, ఎన్ని విపరీతమైన అభిప్రాయాలు, ఎన్ని సంఘర్షణలు, ఎన్ని ఆలోచనలు ?

రమాదేవి నన్ను బావని చేసుకోమని ఎందుకు చెబుతున్నది ? నేను బావను చేసుకోటానికి ఇష్ట పడ్డట్లయితే రమాదేవి అభిప్రాయం ఏ తీరుగా ఉంటుందో ? మనస్ఫూర్తిగా తనూ ఈ అభి ప్రాయాన్ని సమర్థిస్తూనే అట్లా అన్నదా ? నా ఆంతర్యం ఏమిటో తెల్సుకోవాలనే ఉద్దేశ్యంతో అన్నదా ? ఏమిటో ? జీవితాలే అశాశ్వతమైన ప్పుడు వూహలు శాశ్వతంగా ఎట్లా ఉంటయ్యను కున్నాను.

కాలేజికి వెళ్ళాను. మధ్యాహ్నం కాలేజీ వదిలాక టిఫిన్ రూంలో ఫలహారాలు చేస్తున్నప్పుడు ప్రమీల అన్నది.

''ఏమే సీతా, గుంటూరు కబుర్లేమిటి?''

''ఏం లేవే, బాబుని చూసివద్దామని వెళ్ళాను.''

''బాబునా, బావనా'' అంటూ నవ్వింది ప్రమీల.

''నువ్వు కాదన్నా, అవునన్నా దేవుడి దగ్గర మాట తప్పలేవుగా.'' అన్నది మళ్ళా నావైపు చూసి నవ్వుతూ.

''దేవుడేమిటి. కొత్తగా మాట్లాడుతున్నావే'' అన్నాను.

''సాయంత్రం మా యింటికి రా దేవుణ్ని చూపిస్తాను.''

''అంత పుణ్యం కూడానా. మీ ఇంట్లో దేవుడు వెలిశాడా'' అన్నాను ఆశ్చర్యంగా.

''ఆహా. దేవుడున్నాడు. స్వామిని మా ఇంట్లో చూడద్దువుగాని, సాయంత్రం నాతో రా'' అన్నది ప్రమీల. నాకేం అర్థంకాలేదు. సాయంత్రం ప్రమీల ఇంటికి వెళ్ళాను. వాళ్ళ ఇల్లంతా ఎంతో మంది ఆడవాళ్ళు, మగవాళ్ళతో నిండిపోయింది. ఆ హాల్లో శ్రీ వేంకటేశ్వరస్వామి పూజామందిరం

# హృదయ కుసుమాలు

ఉంది. ఎదురుగా ఒక స్టూలు వెలిగించనిది ఉన్నది. స్వామికి దణ్ణంపెట్టుకుని పూలు పూజ చేశారు. స్టూలు దానంతట అదే జరగటం మొదలుపెట్టింది. ముగ్గురు పిల్లలు ఆ స్టూలుమీద పొట్ట అంటీ అంట కుండా తమ రెండు చేతులూ వేళ్ళతో పూరికే ముట్టుకున్నట్లుగా ఆ స్టూలు పొట్టమీద పెట్టారు. మన మనస్సులోని ప్రశ్నలను అంటే ఎవరి ప్రశ్నలను వారు ఆ స్టూలుతో రహస్యంగా చెప్పినట్లుగా మన నోటితో అనుకుంటే దాన్ని ఆవేశించిన స్వామి ఆ అడిగిన విషయం అవుతుందో కాదో చెప్తారట.

అంతా ప్రశ్నలడిగి వెళ్ళారు.

''నువ్వు అడగవే సీతా'' అన్నది ప్రమీల. స్టూలుకి నమస్కరించి నా మనస్సులో ఉన్న రెండు ప్రశ్నలూ అడిగాను. రెండూ ''ఆ'' అని స్టూలు కొడు రాసింది. నా మనస్సులోని ఆందోళన సిరింది.

అంతా అయ్యాక స్వామికి మళ్ళా పూజచేసి హారతి యిచ్చారు. తీర్థ ప్రసాదాలు తీసుకుని ఇంటికి వచ్చేశాను, అంటూ సంతోషంగా చెప్పింది సీత.

''చాలా విచిత్రంగానే ఉందే. అయితే స్వామి స్టూలు రూపంలో తన భక్తులకు దర్శన మిస్తున్నా రన్నమాట. చాలా బాగుంది. ఇంతకీ నీ ప్రశ్న లేమిటి'' అన్నది రాధ.

''నేను చెప్పను. అంతా వింటే నువ్వే తెల్సు కుంటావు. కాని, ఒక్క సంగతి. స్టూలు రూపంలో స్వామి చెప్పినవన్నీ సత్యంగానే జరిగినయ్యి. తరు వాత చాలామంది చెప్పారు'' అన్నది సీత.

''సరే ఇంక నీ కథ చెప్పు'' అన్నది రాధ. సీత చెప్పసాగింది.

''ఇంటికి వెళ్ళాక మళ్ళీ ఆలోచించసాగాను. నేను బావను చేసుకోవాలనేదే అక్కయ్య కోరి కయితే అక్కయ్య నాకు కల్లో ఎప్పుడూ కనబడి చెప్పలేదే ? నేనంటే అక్కయ్యకు యిష్టంలేదా? తన కన్న కొడుకుమీద, పసివాడిమీద ఆపేక్ష లేదా? లేక దానికి జీవితంలో ఇంకో కోరికలేం లేవా ! జీవితంలో నాలుగోవంతు వయస్సయినా గడ లేదే ? దాని కోరికలు దానితోనే మట్టిపాలయి నయ్యా ? తన స్థానం నేను ఆక్రమించటం అక్కయ్యకు ఇష్టంలేదా ? నేను బాబుకి తల్లి కావటం అక్కయ్య ఎందుకు కనబడదు ? ఏమిటో పిచ్చిగా ఆలోచించేదాన్ని.

ఏమిటో ఈ పిచ్చి ఆలోచనలతో ఆ రాత్రి అన్నం కూడా మర్చిపోయాను. ఆకలిలేదు. నాన్న గదిలోకొచ్చి పిలిచేటంత వరకూ ఏమిటో ఆలో చిస్తూనే కూర్చున్నాను.

''ఏమమ్మా సీతా, అట్లా దిగాలుపడి కూర్చున్నావేం'' అన్నారు నాన్న. ఖంగారుగా లేచి ''ఏంలేదు నాన్నా. కొంచెం తల నొప్పిగా ఉంది.'' అని బొంకాను.

''కాదమ్మా. అంతా నాకు తెల్సు. బావను చేసుకోటానికి నీకు యిష్టంలేకపోతే బలవంతంగా కట్టపెట్టం తల్లి. నీ యిష్టమే నా యిష్టం. అమ్మ సంగతి నీకూ తెలుసు. సావకాశంగా ఆలో చించే చెప్పు. తొందరేంలేదు.'' అని వెళ్ళిపోయారు నాన్న.

నాన్న మాటలతో నా మనస్సు ఎందుకో తేలిక పడినట్లయింది. పెద్ద బరువు దించినట్లయింది. అట్లా అవటానికి అసలు ఏమైవరయినా ఆలో చంతం పెడితే కదా.

ఇష్టతగాని, అయిష్టతగాని ఒక వ్యక్తిమీద చూపాలంటే అది నిలకడగా ఎప్పుడూ ఉండదు. బాంధవ్యాన్నిబట్టీ, వ్యక్తిగత విలువల్నిబట్టీ మారుతూ ఉంటుంది.

పెళ్ళీడుకొచ్చిన ఆడ, మొగ పిల్లలు అనేక మంది ఉంటారు. నిత్యబేరాకా మనం బజారులో చూసిన చూస్తున్న ఒక వ్యక్తి పెళ్ళిచూపులకు

30 వ పేజీ చూడండి

'కాస్త తాపీగా తినరా బాబూ! ఎవరైనా తెలిసిన వాడొస్తే... నాకీ బిల్లు బాధయినా తప్పవచ్చు!'



"ఏప్రిల్ ఫూల్" లో సైరాబాను.

# హృదయ కుసుమాలు

27 వ పేజీ తరువాయి

తలస్తున్నదిలేంటే, చివరికి ఆ సంబంధం అయినా, కాకపోయినా, వాళ్ళకి పెళ్ళివారనే బిరుదు తగిలిస్తాం. పెళ్ళికొడుకు వచ్చాడనో, వచ్చలేదనో అంటాం. అప్పటికప్పుడే అబ్బాయి పెళ్ళికొడుకు జాబితాలోకి వచ్చేస్తాడు. అట్లాగే ఆడపిల్లలూను. పెళ్ళిచూపులకి కూర్చోబెట్టంగానే ఆపిల్ల ముఖాన పెళ్ళికూతురు ముద్ర పడిపోతుంది. ఈ మార్పులన్నీ ఊహించుకునే బాంధవ్యాన్నిబట్టే ఏర్పరచుకున్న అభిప్రాయాలు.

ఇదివరకు రోజుల్లో అక్కయ్య భర్తగా, బావగా నా మనస్సులో స్థానం ఏర్పరచుకుని ఆ పరిస్థితులకు తగినట్లుగా మాట్లాడాను. అక్కయ్య పోయాక అభాగ్యుడు బాబు తండ్రిగా నా మనస్సులో నిలుపుకుని సానుభూతి కనబరిచాను. ఇప్పుడు కాబోయే భర్తగా మనస్సులో స్థానమేర్పరచుకుని గౌరవంతో కూడిన సిగ్గుతో బావతో మాట్లాడాలా ? బాబుకి తల్లిగా మాతృదేవిగా నా అభిప్రాయాల్ని మార్చుకుని వాడి పోషణ భారం నేను నెత్తిన వేసుకోవాలా ? కట్నం కానుకలు ఇచ్చుకోలేని తల్లిదండ్రుల మనశ్శాంతి కోసం, వారి సంతోషం కోసం, తల్లిదండ్రుల ఋణం తీర్చుకోడానికిగాను నేను బావను పెళ్ళి చేసుకోవాలా ? ఏది సవ్యమౌతుంది ? ఏది అపసవ్యమౌతుంది ? ఇందర్ని సంతోషపెట్టటానికి నేను పాత్రురాలనవాలా ? ఈ రీతిగా అక్కయ్య ఆత్మను సంతోషపెట్టాలా ? అమ్మ మనఃక్లేశాన్ని ఈరీతిగా పోగొట్టాలా ? వీరందరి బాగోగులూ ఆలోచించి, అందర్నీ సంతోషపెట్టటమే నా కర్తవ్యమా ? ఏమిటీ ఆలోచనలు, ఏమిటీ పిచ్చి ? ఏమిటీ భ్రమ ? ఏమిటీ ధోరణి ? ఇట్లా మథన పడుతూ ఉండేదాన్ని.

ఆ రాత్రి భోజనం చెయ్యకుండానే పడుకున్నాను, ఎంత ప్రయత్నించినా నిద్ర పట్టలేదు. కళ్ళుమూస్తే అక్కయ్య, బావ, బాబు, రమాదేవి, సుభద్ర, కృష్ణవేణి, జ్యోతి, ప్రమీల, బావ తల్లిదండ్రులు, అమ్మ, నాన్న అందరూ నావైపే చూస్తున్నట్లు కనిపించేవారు. ఇందరి జీవితాలు నా నిర్ణయంమీద ఆధారపడి ఉన్నయ్యా ? అయితే నా జీవితం ఎవరిమీద ఆధారపడి ఉన్నట్లు? నా నిర్ణయంమీదనేగా ? అనుకుంటూ ఎప్పటికో నిద్రపోయాను.

*   *   *

తెల్లవారింది. ఎట్లాగో పదయింది. కాలేజికి వెళ్ళాను. నాపేర ఉత్తరం. ఆత్రంగా చదివాను. రమాదేవి రాసింది.

సీతా,

క్షేమంగా గుంటూరునుంచి వెళ్ళావనుకుంటాను మీ బాబు కులాసాగా ఆడుకుంటున్నాడు. ఎవరేమనుకున్నా, ఏమనుకున్నా ఏమిటో వాణ్ని చూడకుండా ఒక్క రోజుకూడా ఉండలేను. వాణ్ని ఎత్తుకోకుండా ఉండలేను. ప్రతిరోజూ ఆలోచిస్తూనే ఉంటాను. తల్లితండ్రి కూడా లేని పిల్లలు ఎంతమంది లేరు. అందర్నీ ఆదరించి సానుభూతి చూపిస్తున్నామా ? అట్లాగే బాబు విషయంలో కూడా నే నెందుకు ముభావకంగా ఉండకూడదు. రోజూ వాళ్ళింటికి వెళ్ళి వాణ్ని నే నెందుకు ఎత్తుకోవాలి. నాకేం సంబంధం. నాతో మాట్లాడని, నావైపు కన్నెత్తి చూడని మీ బావగారి కొడుకును గురించి నే నెందుకు ఆదుర్దా పడాలి ? ఎంత ఆలోచించినా నాకేం అర్థంకాదు. ఆలోచిస్తూనే అప్రయత్నంగానే వాళ్ళింటికి వెళ్ళి బాబుని ఎత్తుకుంటాను. ఏ జన్మలో సంబంధమో?

కొంతమంది వ్యక్తులుంటారు. నివురుగప్పిన నిప్పులా ఏమీ ఎరగని వాళ్ళలా అమాయకంగా ఉంటారు. వాళ్ళకు ఈ కాలపు తెలివితేటలు ఉండవనీ, లౌకికజ్ఞానం తక్కువనీ మనబోటివారి అంచనా. కాని వాళ్ళకు మనకన్నా ఎక్కువ సంగతులు, ఎక్కువ విషయాలూ తెల్సు. ఆ విషయం తెల్సుకోటానికయినా కొంతకాలం పడుతుంది.

నువ్వూ, నేనూ కబుర్లతో కాలక్షేపం చేసే వాళ్ళమే గాని కార్యవాదులం కాదు. మనకూ, మనతో స్నేహంచేసేవారికీ కూడా నోటి మాటలు జాస్తి.

మనకన్నా సుభద్ర నాలుగాకులు ఎక్కువే చదివింది.

సుభద్ర మా కాలేజీలోనే పి. యు. సి. చదువుతున్నది, నీకూ తెల్సుగా. మెడిసిన్ చదువుతున్న

---

విలేఖరి : చూడండి ప్లీడరు గారూ, మీరు ఏ నెలలో తక్కువ అబద్ధాలాడుతారు ?

ప్లీడరు : ఫిబ్రవరి నెలలో. 28 రోజులేగా, అందుకని...!

వై. జి. కె. ప్రసాద్ (బందరు)

---

విద్యార్థి హరనాథ్ అనే అతనితో సుభద్రకు పరిచయమైంది. ఇటీవలనే వారిద్దరూ సినిమాకు వెళ్ళి వస్తుంటే చూశాను. నేనేం మాట్లాడలేదు. నన్నుకూడా వాళ్ళిద్దరూ చూశారు. మర్నాడు సుభద్ర వాళ్ళింటికి వెళ్ళినప్పుడు నాతో చెప్పింది. హరనాథ్ ని ప్రేమించాననీ పెద్దల అంగీకారంతోనే పెళ్ళిచేసుకోదల్చుకున్నామనీ చెప్పింది. నా సలహా అడిగింది. నేనేం చెప్పేది సీతా. సుభద్ర మంచి చెడ్డలు ఆమె చూసుకోవాలిగాని నేనేం చెప్పేది ? వాళ్ళన్నయ్య పెళ్ళి కుదిరితే తరువాత తామూ పెళ్ళి చేసుకుంటారుట. పి. యు. సి. తో చదువు మానేస్తా నన్నది. అతనిదీ ఎం. బి. ఫైనలియరు. మంచివాడే. బాగానే ఉన్నాడు. ఈ సంగతి మీ బావగారికీ, పెద్దవాళ్ళకూ కూడా చూచాయగా తెల్సు, కాని ఇంక బయటపెట్టలేదు. బహుశా మీ పెళ్ళితోనే వాళ్ళ పెళ్ళి కూడా చేస్తారేమో !

పెళ్ళి విషయం నువ్వేం ఆలోచించినదీ నాకు తెలీదు. మా అందరి ఉద్దేశ్యాలూ ఒక్కటే! నువ్వు మీ బావను తప్పక చేసుకుని బాబుకి తల్లివి కావాలని అందరి కోరికా.

అందరి కోరికా తీరుస్తావా. ఈసారి నువ్వు గుంటూరు వచ్చినప్పుడు బాబు నిన్ను 'అమ్మా' అని పిలుస్తాడు. అప్పటికల్లా పెళ్ళికి వస్తావుకదూ

జాబు రాస్తావుగా !

రమాదేవి.

ఉత్తరం చదివి ఆశ్చర్యపడ్డాను. సుభద్రకు ఎన్ని తెలివితేటలు కలిగినయ్యి. సుభద్ర నిజంగా పునర్జన్మ ఎత్తిందా అనిపించింది. ప్రేమించింది. పెళ్ళి చేసుకుంటానని చెప్పింది. పెళ్ళికొడుకు డాక్టరు. సుభద్ర ఎంత తెలివికలది ? ఎంత అదృష్టవంతురాలు ?

మా పెళ్ళి అయితే తామూ పెళ్ళి చేసుకుంటారా ? మా పెళ్ళి కాకపోతే ? మానేస్తారా ? వాయిదా వేస్తారా ? అందరికీ నేను బాబుకి తల్లిని కావాలనే ఉన్నదా ? రమాదేవి కోరిక కూడా నిజంగా అదేనా ?

నా పెళ్ళి. బావతో నా పెళ్ళి. మా పెళ్ళిలో సుభద్ర పెళ్ళి. సుభద్ర కాబోయే డాక్టరుగారి కాబోయే భార్య. ఎంత బావుంది ? రమాదేవి ఎంత చక్కని విషయాలు తెలియపరిచింది. మరి రమాదేవి పెళ్ళి ? రమాదేవి పెళ్ళిచేసుకోదా ? ఇట్లా ఆలోచించాను.

ఏమీ అర్థంకాలేదు. అర్థమయినా కాకపోయినా రమాదేవికి ఉత్తరం రాయాలిగా !

మర్నాడే రమాదేవికి ఉత్తరం రాశాను. రాసిన ఉత్తరం పదిసార్లు చదువుకున్నాను.

రమా !

చక్కని ఉత్తరం రాశావు. జీవితంలోని అనుకున్న మార్పులు జరిగినా జరక్కపోయినా, అనుకోని మార్పులు అనేకం జరుగుతుంటయ్యి. సుభద్ర జీవితంలో ఇంత మార్పు వస్తుందని ఎవ్వరం అనుకోలేదుకదా. నిజమే, నవ్విన నాపచేనే పండుతుంది. సుభద్ర మెడికల్ స్టూడెంటుని ప్రేమించి పెళ్ళిచేసుకోబోతోందా. మంచిదే. ఎవరి జీవితాలు వాళ్ళు ముళ్ళ పొంతల్లోనుంచి పూల బాటల్లోకి మార్చుకుంటున్నరంటే హర్షించదగిన విషయమే. సుభద్ర పెళ్ళి కనులపండుగగా చూద్దాం రమా, ఏమంటావ్ ?

మూర్ఛపోయాను. సుభద్ర పెళ్ళి వాళ్ళన్నయ్య పెళ్ళిలో కలిపి చేస్తారా, అంటే—అంతా అనుకునే మా పెళ్ళితోబాటుగా కలిపి చేస్తారా ? బాగుంది మీ అందరి కోరికా నేను బాబుకి తల్లిని కావాలని. మీరంతా నన్ను బావను చేసుకోమని ప్రోత్సహిస్తున్నారు. నువ్వుకూడ ఆ అందరిలో ఎందుకు కల్సిపోయావో నాకు అర్థంకావటంలేదు. అమ్మా, నాన్నా, బావ తల్లిదండ్రులూ ఈ మాట అన్నారంటే అర్థముంది. బావ మనస్సులోనూ అదే కోరిక ఉన్నదని నాకు తెల్సు. బావ నన్నే ఎందుకు పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నారో నాకు తెల్సు. ఆయన ఈ విషయంలో నన్ను అడిగారనికూడా నీకు తెల్సు.

కాని రమా ! నేను స్వార్థపరురాల్ని కాదు, నా స్వార్థంకోసం మరొకరి జీవితంలో నిప్పులు పొయ్యలేను. అది నా వూహకందని విషయం. బావ మీద నాకు కోపంగాని, ద్వేషంగాని లేదు. అయిష్టతలేదు. కాని ఎందుకో నా మనస్సు అటు మొగ్గటంలేదు. కారణం నేను చెప్పలేను. ఒక వ్యక్తికి ద్రోహంచేసి నేను సుఖపడేదిమాత్రం ఏముంది ? కొత్త సుఖంకోసం, కొంతమందిని దూరం చేసుకోవడం నాకు ఏమాత్రం ఇష్టంలేదు.

నా జీవితంతో నేను మనసారా ఆడుకోలేక పోతున్నాను. మరొకళ్ల జీవితంతో నేనేమాత్రం ఆడుకోగలనో నాకేమాత్రం నమ్మకంలేదు.

సుభద్రతో ఈ విషయం చెప్పి త్వరగా తన పెళ్లి శుభలేఖ పంపవలసిందిగా ప్రార్థిస్తున్నానని విన్నవించు. సుభద్ర పెళ్లిలోనే మనం మళ్లా కలుసుకుందాం. సరేనా ?

జాబు వెంటనే రాస్తావుగా రమా ?

సీత.

ఉత్తరం పోస్టులో వేశాను. అప్పటికిగాని నా మనస్సు కుదుటపడలేదు. పెద్ద బరువు దించినట్టుగా ఉంది.

నా ఉత్తరం రమాదేవికి హర్షామోదాన్ని కలగజేస్తుందా ?

రెండు రోజులు గడిచాయి. మళ్లీ నాకో ఉత్తరం వచ్చింది. చూస్తే అది సుభద్ర రాసిన ఉత్తరం. ఉత్తరం చదువుకున్నాను. నాకు పొట్ట చెక్కలయ్యేలా నవ్వు, సుభద్రమీద జాలి ఒక్కసారిగా కలిగినయ్యి.

సీతా !

నామీద కోపం రాకుండా ఉంటే ఈ ఉత్తరం చదువు సీతా. కొందరి జీవితాలు దేశసేవకు అంకితమౌతయ్యి. కొందరి జీవితాలు ఇతరులను సుఖపెట్టటానికే అంకితమవుతాయి. మరికొంతమంది తమ జీవితాలనే తాము సుఖపెట్టుకోలేక సతమతమైపోతూ ఉంటారు. అలాంటివారు ఇతరుల జీవితాలని ఏం సుఖపెట్టగలరు ? నేను ఈ మూడవ కోవకు చెందిన వ్యక్తి నేమో ననిపిస్తున్నది. వీళ్లకి ప్రతి విషయంలోనూ ఆతృతా, ఆదుర్దా ఎక్కువ. స్వార్థంకూడా ఎక్కువేనేమో ఈ స్వార్థం ఎక్కువయితే తామేం చేస్తున్నదీకూడా ఆలోచించకుండా కొన్ని పన్లు చేస్తారు. అవి కనక కలిసొస్తే వాళ్లు జీవితంలో బాగుపడినట్టే.

కథల్లోలాగా, సినిమాల్లో మాదిరిగా నేను హరనాథ్ అనే మెడికల్ స్టూడెంటును ప్రేమించాను. నా మనస్తత్వం తెల్సిన నువ్వు నేనింత పని చేస్తానా అని ఆశ్చర్యపడొచ్చు. నీకేకాదు. నామట్టుకు నాకూ ఆశ్చర్యంగానే ఉంది. కల్లోనయినా తలచని, అనుకోని విషయం. తెలియని అనుభూతులు. ఎంతో ఆలోచించి, ఎన్నాళ్లో మథనపడి, తర్కవితర్కాలుచేసి, ఈ నిర్ణయానికి వచ్చాను. అమ్మకూ, నాన్నకూ నా నిర్ణయాన్ని చెప్పాను. నన్ను తిట్టారు. దూషించారు. ఏవో మాటలన్నారు. గాలి దుమారం రేగింది. జడివాన కురిసింది. ప్రశాంత వాతావరణం ఏర్పడింది. అంతా ఒప్పుకున్నారు. మా ఇద్దరి పెళ్లికీ అంత ఇష్టపడ్డారు. కాని ఒకచిన్న షరతు. ముందు అన్నయ్యతో నీ పెళ్లి. తరువాత ముహూర్తానికి మా పెళ్లి ఒకటి రెండు రోజులు వ్యవధిలో. మనిద్దరి పేర్లూ ఒక శుభలేఖలో ఎక్కితే ఎంతో బావుంటుంది. నాకూ చాలా సంతోషంగా ఉంటుంది. కాని అన్నయ్య రెండో పెళ్లికి అచ్చు శుభలేఖలు కూడానా అన్నాడు. ఇంక అన్నయ్య మాటకు తిరుగేముంది. మా అక్కయ్య పెళ్లిచూపులకి వచ్చినప్పుడు నువ్వొకమాట అన్నావు. గుర్తుందో లేదో. ఆడబిడ్డ పోస్టు చాలా హోదాగల పోస్టనీ, జిల్లాబోర్డు ప్రెసిడెంటు లాంటిదనీ. దాకు ద్వారా, అంటే నీ రీత్యా ఆ ఉద్యోగం కావాలి. మరి ఆ ఉద్యోగం ఇప్పిస్తావా ?

రెండు రోజుల్లో మా నాన్నగారు మీ ఇంటికొస్తున్నారు. ముహూర్తాలు పెట్టుకోటానికి. అందరి సంతోషం, అందరి ఆనందం నీ మీద ఆధారపడి ఉన్నయ్యి.

''సీత అన్నయ్యను చేసుకుంటుందా లేదా'' అని ప్రశ్న వేసుకుని బాబుని రెండు వేళ్లల్లోనూ ఒక వేలు పట్టుకోమన్నాను. మధ్య వేలూ, చూపుడు వేలూ వాడి ముందుంచి ప్రశ్న అడిగాను. ఎడూ అసాధ్యుడే. వాడికిమాత్రం తెలీదూ. సీతని వాళ్లమ్మగానే ఎంచుకున్నాడు. బాలవాక్కు బ్రహ్మవాక్కు గదా !

మా అందరి ఆశలూ నీ మీదనే పెట్టుకున్నాం. అందరి జీవితాలూ సరిదిద్దగల శక్తిసామర్థ్యాలు నీలోనే ఉన్నయ్యి. పువ్వు పుట్టగానే పరిమళిసుంది. పుష్ప సౌరభం అంతా ఆశిస్తారు. అంతా కాంక్షిస్తారు. అన్నయ్య విషయంలో కాంక్షకాదు. ఆశకాదు, వాంఛకాదు. నిన్ను మనస్సులో పూర్తిగా నింపుకున్నాడు. నీమీద విశ్వాసం ఉంచాడు.

అన్నయ్య హృదయ కుసుమానివి. వెంటనే జాబు రాస్తావుగా సీతా !

సుభద్ర.

ఆ రోజునే సుభద్రకు ఉత్తరం రాశాను.

సుభద్రా,

నా పెళ్లి విషయంలో నేను ఏ ఆలోచనకూ రాలేదు; బహుశా రాలేనేమో ?

నీ పెళ్లి సుభలేఖ కోసం ఎదురుచూస్తున్నాను. త్వరలో మీ దంపతుల్ని చూడాలని ఉవ్విళ్లూరుతున్నాను.

డాక్టరు భార్యగా త్వరలోనే నిన్ను చూడబోతానన్నమాట. ఎంత అదృష్టం ?

సీత.

సుభద్ర రాసిన ఉత్తరం నాన్నకూ అమ్మకూ చదివి వినిపించాను. నాన్న ముభావంగానే విని ఊరుకున్నారు. అమ్మమాత్రం నన్ను చీవాట్లు పెట్టింది. ఎదిగినపిల్లని ఎన్నాళ్లు ఇంట్లో పెట్టుకున్నా ర్లేను, గడపలోకొచ్చిన సంబంధం, కట్నం లేని సంబంధం ఇంక ఈ జన్మలో తీసుకురాలేమంది. ఆఖరికు కోపంపట్టలేక ''నువ్వా ఎవరి వల్లోనన్నా పడ్డావు టే సీతా, చచ్చి అది కడుపులో చిచ్చుపెట్టిపోయింది. బ్రతికి నువ్వు మమ్మల్ని కొల్చుకు తింటున్నావు'' అని కంట తడిపెట్టింది.

నాన్న అమ్మను కేకలేశారు. మనస్సు తెల్సుకోకుండా మాట్లాడవద్దన్నారు. దానికి ఇష్టం లేని పెళ్లి చెయ్యనన్నారు.

''తండ్రీ కూతురూ కలిసి నన్ను వేధిస్తున్నారు. మీ అలుసు చూసుకునే అది ఆ తీరుగా ఉంది. ఎప్పుడో ఆ కాస్త మాటా మనమూ చెవిన వేసుకుంటాము. ఫలాని వాళ్లమ్మాయి సీత......''

నేను వినలేక గదిలోకిపోయాను. తలుపు గడియపెట్టి భోరున ఏడ్చాను. అంతకన్నా నేను చెయ్యగలిగిందేముంది ? ఆఖరికి కన్నతల్లి దృష్టిలోకూడా నీచమైన స్థానాన్ని ఏర్పరచుకున్నాను. నా జీవితం ఎంతమందికి ఎన్ని సమస్యల్ని తెచ్చిపెట్టింది. నా మనస్సులో అక్కయ్య మెదిలింది. జాలిగా నా వైపు చూసింది. బాబుని చేతుల్లో పెట్టుకుని నా వైపు దీనంగా చూసింది. అక్కయ్య బాబుని నాకు ఇస్తుందా ? నేను అక్కయ్య వద్దకు వెళ్లాలా ? ఆలోచిస్తున్నాను.

ఆ రోజంతా కన్నీళ్లతోనే కాలం గడిపాను. ఇంతకన్నా నేను చెయ్యగలిగిందేమీ లేదా ? జీవించి ఉంటే నా జీవిత ధ్యేయం ఏమిటి? నా కర్తవ్యం ఏమిటి ? చదువుకుని నేను చెయ్యగలిగిందేమిటి ? ఈ పరిస్థితుల్ని ఎదుర్కొని చెయ్యబోయేదేమిటి ? ఇట్లా ఆలోచిస్తూ సతమతమైపోయాను.

మూడో రోజున సుభద్ర తండ్రి రంగారావుగారు వచ్చారు. నా మానసిక వేదనకు అంతులేదు. మనస్సులోనే కుమిలిపోతున్నాను. (సశేషం)



'ఇదేం గుడ్డయ్యా! మరీ చవక బారు గలీబుల గుడ్డలావుంది!... మరోటి చూపించు...'

శపుతున్నాయి రావుకు. ఏం చెయ్యాలో ! అనే అను భవం కూడ అంతగా లేదు.

"మీరేం అనుకోకండి మాష్టారూ ! మా చెల్లెలు కాస్త చిలిపిది. నాన్నగారి గారాబం కూడ ఎక్కువ." వంచిన తల ఎత్తకుండానే మాట్లాడింది ఉష.

ఈ మాటలతో కాస్త ధైర్యం పుంజుకున్నాడు ఆనందరావు.

"చూడండి .... కల్పించిన పరిస్థితులవల్ల ఇన్నాటి వరకు నిరాశావాదిగా బ్రతికాను .... కాని ఈరోజు కాస్త ఆశ అనేది ఏ మూలనో కనపడుతుంది .... కాస్త నా కడుపుకు తిండి దొరకగలదనే ఆశ మీ నాన్న గారు కల్పించారు. నా గడచిన జీవితాన్ని చెప్పి మీ లేతమనస్సులు పాడుచేయటం ఇష్టంలేదు. నేను మీకు ప్రవేటు చెప్పటానికి అసమర్థుడినని మీరు మీ నాన్నగారితో చెప్పారంటే ఈ వున్న ఆధారం కూడ పోతుంది ...." మాటలు పెగలక గొంతుకు జీరవోయింది రావుకు. కనుకొలకుల్లో కన్నీళ్ళు ప్రస్ఫుటంగా కనపడుతున్నాయి.

"అక్కా ! మాష్టారు ఏడుస్తున్నారే ! చూడు ఎలా చిన్న పిల్లాడిలా !" అంటూ అరుణ అక్కయ్యను చూసేటప్పటికి ఉష కూడ కన్నీళ్ళు కార్చటం వింతగా కనపడింది.

ఎందుకిలా ఇద్దరూ ఏడుస్తున్నారో ! అనేది ఎంత ఆలోచించినా అరుణకు అంతుదొరకలా.

"ఏం అక్కా ! ఎందుకలా ఏడుస్తావు ? నాన్న గారితో చెప్పనా ?" అంది అరుణ ఏం చేయాలో తోచక.

ఈ మాటలు వినేటప్పటికి ఒక్కసారి ఆనంద రావు కళ్ళు పర్చుతో తుడుచుకుని ఉషవైపు చూసేటప్పటికి ఆశ్చర్యపోయాడు.

"ఏమండీ క్షమించండి .... మీరుకూడ బాధ పడతారని తెలిస్తే అసలు చెప్పకపోదును" తడి ఆరిన గొంతుకతో తడబడుతూ అన్నాడు రావు.

"ఉబ్బే ! ఏంలేదు మాష్టారు" అంటూ పైటతో కన్నీళ్ళు తుడుచుకుంది ఉష.

ఇద్దరి మొహాలవైపు ఎంతసేపు తరచి చూసినా ఏం అంతుబట్టలా అరుణకు.

ట్యూషన్ అయిన తరువాత చెల్లెల్ని పిలుచు కుని తన గదిలోనికి పోయింది ఉష.

"ఏం అక్కా? ఎందుకు ఇందాక ఏడుస్తున్నావు?"

"ఏంలేదుగాని, క్రొత్త మాష్టారు గురించి ఏం చెపుతావు ?"

"ఛీ ! ఏం బాగుండలేదక్కా ! చిన్న పిల్లాడిలా ఏడువు ! నాకేం నచ్చలేదు. నాన్నగారితో ఇంకొకరిని చూడమని చెప్పనా" అంది తన అయిష్టాన్నంతా వెళ్ళగక్కుతూ.

"అలా చెప్పావంటే నన్ను అక్కా అని పిలవద్దు! అసలు నాతో మాట్లాడనివ్వను. నా దగ్గిర పడుకో నివ్వను" బెదిరిస్తూ అంది ఉష.

"ఎందుకక్కా నామీద కోపం ?.... నువ్వేం చెప్ప మంటే అలా చెపుతా" అంది జాలిగా అరుణ, ఉష అస్సంతపని చేస్తుందంటే భయంతో, నెమ్మదిగా దగ్గరకు చేరుతూ.

"ఇవాళ జరిగింది ఏం చెప్పకూడదు తెలుసా ?... మాష్టారు బాగా చెపుతున్నారని కూడ చెప్పు" చెల్లెల్ని దగ్గరకు తీసుకుంటూ అంది ఉష.

## పిరికివాడు

(21 వ పేజీ తరువాయి)

"అలాగే" అక్కమీద మమకారంతో అంది అరుణ.

తన అక్క ఇలా ఎందుకు చెప్పమంటుందో ? మాష్టారు చెపుతూ అక్కయ్య కన్నీళ్ళు అప్పి గుర్తుకువచ్చి ఏం మాట్లాడాలో తెలియలేదు అరుణకు.

రోజులు సాఫీగానే గడుస్తున్నాయి రావుకు. పరీక్షలు కూడ పూర్తి అయినాయి. రావు కష్ట మైతేనేమి, వాళ్ళ శ్రద్ధ అయితే నేమి పిల్లలు సరిగా పరీక్షలు వ్రాయటంతో గోపాలరావుగార్కి సంతృప్తి కలిగింది.

"ఈరోజు మీ అరుణ రాలేదే ?" అన్నాడు రావు ఉష ఒక్కతే వచ్చి కూర్చోటంతో.

"నాన్నగారితో వెళ్ళింది...."

"బాగా వ్రాసారా పరీక్షలు ?" బిడియపడు తూనే అడిగాడు రావు.

"వూ ...." అంది ఉష వంచిన తల ఎత్త కుండానే.

ఇంకేం అడగాలో అర్థంకాలేదు రావుకు.

"మాష్టారూ ! నన్ను గురించి మీ అభిప్రాయం ఏమిటి ?" తల పైకెత్తకుండానే క్రీగంటితో చూస్తూ, పైట సర్దుకుంటూ అడిగింది ఉష.

"ఏం మాష్టారు ! మాట్లాడరు ? ...." ఆలస్యం భరించలేనట్లు, ఆశగా అతని కళ్ళలోకి చూస్తూ అడిగింది. ఉష.

"భాగ్యవంతులైనా మనుష్యుల్ని జాలితో అర్థం చేసుకునే శక్తి ఉంది ...." చాల తూచి జాగ్రత్తగా మాట్లాడాడు రావు.

"అంతేనా మాష్టారు !...." అనుకున్న సమా ధానం రాకపోవటంతో నిరుత్సాహం లీలగా ఉష మొహంలో వెల్లడవుతుంది.

"మాష్టారూ !.... మిమ్మల్ని ప్రేమిస్తున్నా !.. నాన్నగారికీ తెలిపి మిమ్మల్ని పెళ్ళిచేసుకోవాలని...." మాటలు బరువుగా, సిగ్గుపడుతూనే చెప్పింది ఉష.

అనుకోని సంఘటన—ఎటూ జవాబు చెప్పలేని మనస్సు .... నిజం చెపితే ఆ లేత హృదయం గాయ పడుతుందేమో !— ... అలాగే ఆమె మొహంలోకి చూస్తూ కూర్చున్నాడు.

"ఏం మాష్టారు, మాట్లాడరు ?"

"నన్ను మీరు ప్రేమిస్తున్నారా ? .... పెళ్ళి.." తడబడుతూనే అడిగాడు రావు తేరుకుని.

"అవును మాష్టారు." చాల దృఢంగా చెప్పింది అరుణ.

"నన్ను......మీరు ప్రేమిస్తున్నారా ?.... పెళ్ళి........" తడబడుతూనే అడిగాడు రావు తేరుకుని.

"అవును మాష్టారు." చాలా దృఢంగా చెప్పింది ఉష.

"చాలా పొరబాటు పనిచేస్తున్నారండీ !ఛే... నేను మీలో అలాంటి ఆశలు రేకెత్తించి ఉంటే క్షమించండి........"

"ఇది నా కోరిక మాష్టారూ ! నాన్నగారు నా మాటను కాదనరు.....మీ కిష్టంలేకపోతే".

"నా మీద మీకున్నది జాలి......మీ లేత హృదయంలో ముద్రవేసుకుంది. జాలిగాని ప్రేమ కాదు." ఆమె మనస్సు మార్చాలనే ఉద్దేశ్యంతో నొక్కి పలుకుతూ అన్నాడు రావు.

"నన్ను పరీక్షిస్తున్నారా ?.......నన్ను పూర్తిగా అర్థంచేసుకోలేకపోతున్నారు".

"పొరపాటు పడుతున్నారు......అంతస్థులు మరచి ప్రేమించటం !.....జాలిని ప్రేమని భ్రమించటం నాలాంటి నిర్భాగ్యుడ్ని పెళ్ళిచేసుకోవటం ! ఛే...."

"మాష్టారూ !..... ఎందుకు నన్నిలా చిత్ర హింసచేస్తారు, లోకం దృష్టిలో మీరు నిరుపేదలు. కాని నా హృదయంలో మీ స్థానం ఉత్తమమయింది. కావలసింది మీ హృదయంకాని మీ స్థితిగతులు కాదు......." చాల బాధపడుతూ ఒప్పించాలనే ప్రయత్నంతోనే చెప్పింది ఉష.

"చూడండి.....లోకం నన్ను పాపడాడి కింద జమకడుతుంది....విశాల హృదయులైన మీ నాన్న గార్కి అన్యాయంచేయలేను. దిక్కులేని స్థితిలో నన్ను ఆదరించిన మీ నాన్నగారిని, ఆయన విశ్వా



"ఇది మంచిరకం చొక్కాగుడ్డ సార్! చాలా కాలం మన్నుతుంది. ఇప్పుడు నేను తొడుక్కున్నది ఈ గుడ్డే సార్!"

# పిరికివాడు

న్ని బాధపెట్టలేను. అంతస్థులు మనకు ముఖ్యం కాకపోవచ్చు ! కాని మీ నాన్నగార్కి, సంఘానికి అంతస్థులు కావాలి....నన్ను క్షమించండి.''

రెండోసారి పూర్తిగా ఓడిపోయాడు ఆనందరావు. అతనిజీవితమంతా అంధకారం. ఉన్న ఒక్కఆదరణ ఈ రోజుతో కూలిపోయిందనే బాధ....... ఆమె హృదయంలో చిచ్చు పెట్టాననే ఆవేదన.

గోపాలరావుగారుకూడ ఈ సంభాషణ విన్నారనేది ఎవరికీ తెలియదుకూడ. ఆయన హృదయంలో సంఘర్షణ ఒకప్రక్క ప్రేమతో చూసుకునే అమ్మాయి, రెండవ ప్రక్క అంతస్థు, సంఘం ఎటూ తెల్చుకోని పరిస్థితులు. ఎంత ఆలోచించినా తీరని సమస్య. కాని ఆయన హృదయంలో రావుకు జోహారులు అర్పించలేకుండా ఉండలేకపోయాడు. పాలు పోసిన పాము కరవదనే పూర్తి నమ్మకం.

ఆమె హృదయంలో నిర్లిప్తత....జాలి అనేది ఏ కోశానా కనిపించదు..... మనస్ఫూర్తిగా మనస్సు అర్పిస్తే ప్రతిఫలం నిరాశ, నిరాదరణ...... ఆమె హృదయం వాటికి తట్టుకోలేక ఉన్న ప్రేమంతా ప్రతీకారం గురించి ఎదురుచూస్తుంది.... తనని నిర్లక్ష్యం చేశాడనే ఆవేదన.....పొంగి వచ్చే దుఃఖం.

అరుణ తన అక్కయ్య గూర్చి చెప్పటంతో రావు హృదయం ద్రవించింది. ఒక్కసారి ఆమెను చూడాలనే ఆశతో ఆఖంతో కబురు పంపాడు రావు. నిద్రలేక .... ఎరుపెక్కిన కళ్ళతో .... సంస్కారం లేని జుత్తుతో .... కాళికలా వచ్చిపడింది ఉష. ఆమెను చూసేటప్పటికి రావు హృదయం ద్రవించింది; పొంగివచ్చే దుఃఖాన్ని జాగ్రత్తగా చిక్కబట్టుకున్నాడు.

''ఏం చూస్తారు మేష్టారు ? .... నా శవాన్ని చూద్దురుగాని పొండి ! .... నన్ను నాశనంచేసి .... నా జీవితాన్ని మట్టిపాలు చేసి, నా హృదయాన్ని ముక్కలుచేసి .... నా ఉసురు మీకు తగలకపోదు.... హృదయంలేని మనుష్యులు .... ఏం రాతిలా నిలబడ్డారు.... పొండి బయటకు ....ఏయ్ వెంకన్నా మాష్టార్ని బయటకు గెంటు ....'' జలజల కారే కన్నీళ్ళు పగిలే గుండె....కాళికలా అడుగులు.... ఇల్లంతా దద్దరిల్లింది ... ముద్దాయిలా తల వంచుకుని నిలబడ్డాడు ఆనందరావు.

''మాష్టారూ !....'' గర్జింపు వినపడింది రావుకు.

ఒక్కసారి అతనిలో కదలిక కలిగింది. ఎదురుగా గోపాలరావుగారు, ఆయన మొహం కందిగడ్డలా ఉంది. మనిషంతా వూగిపోతున్నారు. పెదాలు కంపిస్తున్నాయి, కోపంతో ప్రజ్వరిల్లే కళ్ళు ....ఆయన మొహంలోకి చూడలేక తల వంచుకున్నాడు రావు.

''ఇలా రండి .... ఈ గదిలోకి ....'' చాల తీక్షణంగా ఉంది ఆ ఆజ్ఞ.

''నేనేం చెయ్యలేదండి .... నాకు .... నాకేం తెలియదండి .... నేనేం అన్యాయం చేయలేదు.... మీ అమ్మాయిగారు' కళ్ళలో నీళ్ళు చిప్పిలగా, మనిషంతా భయంతో వొణికిపోతూ చెప్పగలిగాడు రావు.

''మీరేం చేయకుండా అమ్మాయి అలా అవుతుందా ?'' ఇంకా తీక్షణంగా ఉంది గోపాలరావుగారి కంఠం.

ఆయన జరిగింది విన్నా .... ఆనందరావు నేరం తనదికాదు మీ అమ్మాయిదే అని చెప్పిఉంటే ఆయనకు మనశ్శాంతి ఉండును.

''నాకేం తెలియదండి .... నిజంగా'' అంటూ గట్టిగా రెండు చేతులతో కళ్ళు మూసుకున్నాడు రావు గోపాలరావుగారు మీదకు రావటం చూసి జరగబోయేది తలుచుకుని మనిషంతా వూగిపోతూ.

తను ఆశించిన సమాధానం రాకపోయేటప్పటికి ఆయన హృదయం మొదటిసారి ఓటమిని అంగీకరించింది. అతని పరిస్థితి, అమాయకత్వం చూసేటప్పటికి ఆయన హృదయం జాలితో నిండిపోయింది. పరిస్థితులను అర్థంచేసుకునే శక్తి ఉంది కాబట్టి ఆయన కంగారుపడలేదు. ఇందాక కోపం అంతా అమ్మాయిమీద తప్పితే, ఆనందరావుమీద కాదు. తను మిన్నగా ప్రేమించిన అమ్మాయి, అమాయకుడ్ని తిడుతూఉంటే ఆయన హృదయం కోపంతో నిండిపోయింది. కాని అలాంటి పరిస్థితులలో ఎలా నడచుకోవాలో ఆయనకు పూర్తిగా తెలుసు.

ఉపాధ్యాయుడు : (పిల్లలతో) ఏరా ! మీ ఈ వయస్సులో నేను క్లాసులో ఎంత తెలివిగా వుండే వాణ్ణో తెలుసా ! మీ లాగా మొద్దువాణ్ణి గాదు !

తెలివైన విద్యార్థి : మీకు ఆ బుద్ధులు ఎలా వచ్చాయో తెలుసు సార్ ! అంటే మీ ఉపాధ్యాయుడు తెలివైన వాడన్నమాట.

కె. రామచంద్రరావ్ (శ్రీరంగరాజులపల్లి)

''మాష్టారూ ! .... అంత భయం దేనికి .... ఏమోడండి!.... అంతస్థులు అలాంటివి !.... మంచితనాన్ని అర్థంచేసుకున్నా న్యాయం చేకూర్చలేము. అది సరేకానివ్వండి. మీకు కావలసినంత ధనం తీసుకుని .... దూరంగా, హాయిగా బ్రతకండి ....'' ఇనప్పెట్టిలో ఉన్న నోట్లన్నీ అతనిముందు కుమ్మరించాడు ఆయన. రెండవసారి అయినా ఆయన జయిస్తాడనే ధీమా ఆయన కళ్ళలో ప్రస్ఫుటంగా కనబడుతుంది.

ఊహించని పరిస్థితులు ఎదుర్కోవటంతో శిలాప్రతిమలా అయ్యాడు రావు. ఆయన కళ్ళలోకి జాలిగా చూడటం తప్పిత ఏం చేయలేకపోయాడు రావు.

''తీసుకోండి మాష్టారు....'' మరోసారి హెచ్చరించింది ఆయన కంఠం.

నెమ్మదిగా వంగాడు రావు. జీవితంలో అంత ధనం కలలో కూడా వూహించి ఉండలేడు అతను. గోపాలరావుగారి కళ్ళు విజయగర్వంతో మెరుస్తున్నాయి. రావు పదిరూపాయల నోట్లు చేతితో తీసుకున్నాడు.

''ఈ నెలలో వారం రోజులకు జీతం తీసుకున్నాను. అంతకన్నా ఆశించేది లేదు .... మీ సహృదయానికి ఇవే నా ఆఖరి నమస్కారాలు.... దిక్కులేని పరిస్థితులలో ఆదరించారు. మిమ్మల్ని జీవితాంతం మరువలేను .... మీ రనుకునే వూహలు నిజంకావు.... దేవుడుసాక్షిగా చెబుతున్నా మీకుగాని, మీ అమ్మాయిగార్కి గాని ఏం, అన్యాయం చేయ్యలేదు..... ఇకముందు చేయను కూడ .... నమస్తే!'' అంటూ వెనుదిరిగి తల వంచుకుని వెళ్లిపోతున్న రావును కళ్లప్పగించి చూస్తూ కూర్చున్నాడు.

గోపాలరావుగారి హృదయం రెండవ ఓటమిని పూర్తిగా అంగీకరించింది. ఆనందరావు పూర్తిగా డబ్బంతా తీసుకుపోయిఉంటే ఆయన అంత బాధపడి ఉండరు. ఇప్పుడు ఆవేదనకు గురి అవుతున్నారు ఆయన.

'మీ మంచి హృదయాన్ని గాయపరిచాము. డబ్బుతో కొనలేకపోయాము మాష్టారూ ! మేము పూర్తిగా ఓడిపోయాము .... మా ఇంట్లో జరిగిన అవమానాన్ని క్షమించండి.' అతని చేతులు పట్టుకుని అనాలనే గోపాలరావుగారి ఆవేదన.... కాని, మాటలు పెగిలి బయటకు రాలేదు .... ఆనందరావు కనుమరుగు అయేవరకు అలాగే చూస్తున్నారు ఆయన.

''అదేంటి నాన్నా .... మాష్టారు వెళ్లారా ?.... ఈ డబ్బంతా ఏమిటి నాన్నా ?.... నాన్నా పలకవే? ఏం నాన్నా ?''. ఆయన గుండెమీద తలపెట్టి రోదిస్తున్న ఉష మాటలు వినేటప్పటికి ఈ లోకంలోకి వచ్చారు గోపాలరావుగారు.

''నాన్న ఇవాళ చేయకూడని అన్యాయం చేసావు నాన్నా .... నిండు ప్రాణాన్ని బాధపెట్టాను నాన్నా .... దేవుడు కూడ క్షమించడు నాన్నా ... డబ్బు, హోదా, అంతస్థులో మనిషిని కొనవచ్చు గాని, మనస్సును కొనలేకపోయాను నాన్న .... ఎందుకు నాన్నా మనకీ సంపద ? ... నన్ను దేవుడు కూడ క్షమించడు.....''

ఉష ఆఖరి మాటలు ఆయన హృదయంలో ములుకుల్లా గ్రుచ్చుకున్నాయి.

''పిచ్చిపిల్లా ! నాకంతా తెలుసు .... మీనాన్న క్షమిస్తున్నప్పుడు దేవుడు గురించి ఎందుకు ?'' ఉష తల ఆప్యాయతగా నిమురుతూ అన్నారు గోపాలరావుగారు.

''అయితే...మీకు తెలిసే వూరుకున్నారా నాన్నా?''

ఈ ప్రశ్నకు మాటుకు ఆయనకు ఏం చెప్పాలో అర్థంకాలేదు. 

మంధరప్రలలిత

**జరిగిన కథ**

విభిన్న మనస్తత్వాలు గల ఐదుగురమ్మాయిల తండ్రి రామయ్యగారు. ఆయన స్నేహితుని కొడుకు సుధాకర్ మద్రాస్ చూడ్డాని కొచ్చి కళను ప్రేమిస్తాడు. పెద్దలంతా కళను వాళ్ల బావ శేఖర్‌కిచ్చి వివాహం చేయాలనే సంకల్పంతో ఉంటారు. అందుకు భిన్నంగా శేఖర్ శారదచే ఆకర్షింపబడ్డాడు. తన అభిప్రాయం శేఖర్‌కు తెలియపర్చాలని శేఖర్‌తో సినిమా కెళ్లిన కళను సుధాకర్ స్నేహితుడు మోహన్ చూసి బయటికెళ్ళిపోతాడు. మోహన్ సుధాకర్ విషయాలేమైనా చెప్తాడేమో తెల్సుకోవచ్చునుకున్న కళ చాలా నిరుత్సాహపడ్తుంది.

# 8

విశాఖపట్నం వచ్చింది లగాయితు చిత్ర రోజూ సాయంత్రంపూట బీచివరకు వెళ్ళి పుస్తకంనిండా స్కెచ్‌లు వేసుకుని వస్తున్నది. వెలుతురు ఉన్నంత వరకు స్కెచ్‌లు వేసుకోవటం, వెలుతురు మరుగు కావటంతో పుస్తకం మూసేసి ఒకదానితో మరొకటి పోటీపడుతూ వస్తున్న అలలను చూస్తూ తీయని కలలు కనటం, ఆ కలల బరువును ఇంటికి చేర వేయటం— ఇదీ చిత్ర దినచర్య.

ఆ రోజు కూడా మామూలుగానే స్కెచ్ పుస్తకం పట్టుకుని బీచికొచ్చింది. బీచిలో జనం గుంపులుగా కూర్చున్నారు. ఒకచోట ఇద్దరు చిన్న పిల్లలు పిచ్చుక గూళ్లు కడుతున్నారు. ముచ్చటగా ఉన్న గూళ్లనుచూసి మురిసిపోతూ వాటిని ముద్దు పెట్టుకోవాలని ముందుకు వస్తున్నాయి అలలు. మరో అయిదారేళ్ల అమ్మాయి ఇసుకలో బొటన వేలితో గుండ్రగా రాయతున్నది. బఠాణీలు అమ్ముకునేవాళ్లు అటూ ఇటూ తిరుగుతున్నారు. మద్రాసులో ఎంత నడిచినా సముద్రం దరికి చేర్చని మెరీనాలమైన బీచి, రోడ్డుమీదినుండి సముద్రాన్ని కళ్ళ ముందుంచే సన్నని అంచులాంటి వైజాగ్ బీచి—పట్నానికి, పల్లెటూరుకు ఉన్నంత వ్యత్యాసం!

ఆ సందడితో పోల్చిచూస్తే ఇక్కడి వాతావరణం ఎంత నిశ్చలంగాఉన్నది! సంతత కోలాహలం, కేరింతాల మధ్య వూపిరి సల్పని ఆ ఆనందం వేరు— నిశ్చలంగా నమ్రతగా అంజలి ఘటించి నాట్యమాడే ఈ ఆనందం వేరు! చిత్ర మనస్సు పరవళ్లు తొక్కింది. ఆ ఆనందమయ ప్రకృతినంతటినీ రేఖల్లో బంధించాలని చాలసేపటివరకు ప్రయత్నించింది....

కుంకుమ వర్ణాన్ని దాల్చిన సూర్యబింబాన్ని చూసి చిత్ర పుస్తకం మూసేసింది. రోజంతా తీక్ష్ణంగా నిప్పులు గ్రక్కిన సూర్యుడేనా ఇప్పుడిలా వెలవెం బోతూ దొంగలా పారిపోతున్నాడు ? మల్లెల కాంతితో మెరిసిపోయే చంద్రుని ముందు నిలబడటానికి సూర్యునికి సిగ్గు కాబోలు !

చిత్ర ఇంటికి బయల్దేరింది.

దీపాలువెలిగించారు. ఆఫీసు మూసివేసిన గంటదాకా వీధిలోనేగడిపే మగవాళ్ళంతా ఇంటిదారిపట్టారు. రోడ్డుమీద వచ్చేవాళ్ళు, పోయేవాళ్ళు,మధ్యలో హారన్ మోగించుకుంటూ, నడిచేవాళ్ళను పాడలకొడుతూ రయ్యిమని దూసుకుపోతున్న కార్లు, బస్సులు.....

చిత్ర ఒకప్రక్కగా నడుస్తున్నది.. తనముందు ఒక అబ్బాయి ఒక కుక్కను నడిపించుకుంటూ వెళ్తున్నాడు..అరె! ఊర్వశి!....... అదే ఎత్తు, అదేరంగు! ఊర్వశే! సందేహంలేదు!.... బావఎంతో ముచ్చటపడి పెంచుకున్న కుక్క! ఈ ఫలానాభావు డెవరో దాన్ని కాజేసి పోగొట్టి కారుకు తీసుకెళ్తున్నాడు..

చిత్రగబగబా అడుగులు వేసి ముందు కెళ్ళింది.

''ఈ కుక్క మీకెక్కడదొరికింది చెప్పండి! ఇది మాబావది—'' అంది చిత్రగొలుసును పట్టుకుంటూ.

చక్కని ఆకృతి,అందమైన ముఖం—అందులో నల్లగా దిద్దుకున్న మీసాలు —అబ్బాయి మీసాల్ని చూసి చిత్ర నవ్వుకుంది. ఈ రోజుల్లో అబ్బాయిలు ఇంత విచిత్రంగావుంటారేమిటి ? ఉన్న మీసాలు గొరిగి పెన్సిల్‌తో పెయింట్ చేసుకుంటారు!

''ఏమండోయ్. మీరుకాస్త మాటలను జాగ్రత్తగా రానియ్యండి!మీబావకుతప్ప మరెవ్వరిదగ్గర కుక్కలు ఉండకూడదంటారా? '' అన్నాడు అబ్బాయి గట్టిగా గొలుసు పట్టుకుంటూ.

కుక్కమెడలో పటకా, పటకా మీద 'ఎస్' అనే గుర్తు...బావదే! ఇంకా సందేహం ఏమిటి ?

చిత్రకోపంగా చూస్తూ అంది.

''మీరుకూడా జాగ్రత్తగా మాట్లాడితే మంచిది. అది ఖచ్చితంగా మాబావ కుక్కే. ఆ బెల్టు మీద ఎస్ ఉంది చూశారా ? మాబావ పేరు...............''

''మీబావపేరు ఏదంటే కానివ్వండి. ఆంధ్రదేశంలో [illegible] సూర్యనారాయణలు. వాళ్ళందరూ 'ఎస్'ను చూసి ఈ కుక్క మాదేనంటూ పరిగెత్తుకొస్తే బెదిరిపోయి రంభను వాళ్ళ చేతుల్లో పెడతాననుకున్నారా ?''

చిత్ర ఆశ్చర్యపోయింది.

''రంభెవరు ?''

''అదంతా మీకనవసరం ! మీదారిన మీరు వెళ్ళండి. నాదారిన నన్ను వెళ్ళనివ్వండి!'' అంటూ ఆ అబ్బాయి కుక్కను గబగబా నడిపించుకుంటూ తొందర తొందరగా వెళ్ళిపోయాడు. చిత్ర ఎంత ప్రయత్నించినా అతన్ని అందుకోలేకపోయింది. చేతికందిన పండు చెయ్యిజారినట్టు బాధపడింది. ఊర్వశికి కొంచెంకూడా కృతజ్ఞతలేదు. ఉంటే ఇప్పుడా కొత్త మనిషి వెంట తోకాడించుకుంటూ వెళ్లేదా ? బావను మర్చిపోయేదా ?

ఇంటికెళ్లాక చిత్ర బావతో అన్నది.

''ఇవ్వాళ నేను రోడ్డుమీద ఊర్వశిని చూశాను బావా !''

శేఖర్ ఎగిరి గంతేశాడు.

''ఎక్కడ ? వెంటపెట్టుకుని తీసుకురాక పోయావా చిత్రా ?'' అన్నాడు.

''దానికి నువ్వింకా ఎక్కడ జ్ఞాపకం ఉన్నావులే! ఎవడి వెంటో తోకాడించుకుంటూ వెళ్తున్నది...'' అని జవాబిచ్చింది చిత్ర నీరసంగా.

శేఖర్ కళ్ళు ఎరుపెక్కాయి.

''ఎవడా వెధవ ! కనబడితే డొక్క చీరేద్దును !''

చిత్ర ఆ 'వెధవ'కు తనకు జరిగిన సంభాషణ గురించి చెప్పాలనుకున్నది కాని అనవసరమని మాట్లాడకుండా ఊరుకున్నది.

*　　*　　*

కళ, చిత్ర కలిసి గాజుల షాపుకు వెళ్ళారు. గాజులు తీయించి అందమైనవి ఎంచుకుంటున్నారు.

''హల్లో కళా ఎప్పుడొచ్చారు ? గీత రాలేదా?''

భుజం మీద చెయ్యి పడటంతో కళగాజుల మీది నుంచి చూపులు మళ్ళించి అటుచూసింది. ఖరహరప్రియ నవ్వుతూ నిలబడి ఉంది. . . . గీత క్లాసుమేటు !

కళ చిరునవ్వుతో ''పది రోజులు కావస్తుంది. గీత అక్కడే ఉండి పోయింది. ఎంతరమ్మన్నా రాలేదు. . . .'' అంది.

''మరీ మరీ రమ్మని చెప్తే గీత రాకుండా మానేసింది. . . మద్రాస్ వెళ్ళాక దానిపని చెప్తాను!''

గాజులు చేతిలోకి తీసుకుంటూ వాటి అందచందాలను పరీక్షిస్తున్న చిత్రను చూపించి కళ ''మా చెల్లెలు చిత్ర మీకు తెలుసనుకుంటాను!'' అంది.

చిత్ర తలెత్తి చూసి పలకరిస్తున్నట్టుగా నవ్వింది.

ఖరహరప్రియ ''ఒకటి రెండుసార్లు చూశాను'' అంది.

ఇవతలకు వచ్చేస్తున్నప్పుడు ప్రియ వాళ్ళింటికి రమ్మని పట్టుబట్టింది.

కళ ''మరొకసారి వస్తాం. . . ఏమనుకోకండి'' అని తప్పించుకో బోయింది.

ప్రియ కోపగించుకున్నట్టుగా అంది.

# అయిదు రెళ్ళు

[illegible]
కూరిలా కాదనేవారా ?''

కళ ఓడిపోయింది. ముగ్గురూ కలిసి బస్సు మీద మహారాణీపేటకు వెళ్ళారు. ఏటవాలుగా ఉన్న రోడ్డు, రెండు వైపులా విశాలమైన చక్కని ఇళ్ళు, చల్లని సముద్రపుగాలి, చెవులకు సన్నగా వినిపించే హోరు— ప్రియ పసుపు పచ్చని ఒక బంగళా గేటు తెరిచి వాళ్ళిద్దరినీ లోపలికి తీసు కెళ్ళింది. గేటుకు రెండు వైపులా ఉన్న ఖాళీ స్థలంలో గుబురుగా పెరిగిన చెట్లు ఆ ఇంటి అందాన్ని ద్విగుణీకృతం చేస్తున్నాయి. వరండాలో కుండీల్లో క్రోటన్స్ మొక్కలు, పూల మొక్కలు చల్లగాలి పాడుతున్న సంగీతాన్ని తలలూచి వింటున్నాయి.

మనోహరమైన ఆ రమణీయతలో లీనమై పోయిన చిత్ర హఠాత్తుగా రైలుకూత వినిపించటంలో ఉలిక్కిపడింది.

''మీ యింటికి దగ్గర్లో స్టేషను ఉందా'' అనడిగింది చిత్ర చుట్టూ కలయ జూస్తూ.

ప్రియ పకపకలాడింది.

''అది రైలు కూత కాదు. మా అన్నయ్య ఫ్లూట్ ప్రాక్టీస్ చేస్తున్నాడు!''

కళ, చిత్ర డ్రాయింగు రూంలో కూర్చున్నాక ప్రియ లోపలికెళ్ళి అమ్మమ్మను తీసుకొచ్చి పరిచయం చేసింది. వాళ్ళ తాతగారికి రెండు రోజులై వంట్లో బాగుండలేదట. మేడ మీది గదిలో పడుకున్నారని చెప్పింది.

ప్రియ అమ్మమ్మ కాస్సేపు మాట్లాడి ''మా బేబీ ఉండబట్టి మీరొచ్చారు. . . అది వెళ్ళిపోయినా అప్పుడప్పుడూ వస్తూ ఉండండమ్మా'' అంది.

ఖరహరప్రియను ఇంట్లో ముద్దుగా బేబీ అని పిలుస్తారు.



కళ నవ్వింది.

''మాదీ మెడ్రాసేనండి ప్రియతో పాటు మేం కూడా వెళ్ళిపోతాం—'' అంది.

ప్రియ కొంటెగా నవ్వింది.

''అదేం కాదులే అమ్మమ్మా ! కళ మాత్రం ఇక్కడే ఉంటుంది. వాళ్ళ బావ చదువు పూర్తయింది. . . . .''

కళ ముఖం నల్లబడింది కాని కనబడకుండా కప్పి పుచ్చుకుంది. లేని నవ్వు తెచ్చుకుంటూ ''మీ అన్నయ్యను మాకు పరిచయం చేయనే లేదేం ?'' అంది.

''పదండి ! అన్నయ్య గదిలోకి మనమే వెళ్దాం. ఫ్లూట్ పుచ్చుకు కూర్చున్నాడంటే వాడికి మరో సంగతే జ్ఞాపకం ఉండదు. . . .''

''పోనివ్వండి ! ఆయన్ని డిస్టర్బ్ చేయటం దేనికి ?'' అని వారించింది చిత్ర. కాని ప్రియ దేనిపించుకోలేదు.

''అన్నయ్య మనల్ని చూస్తేనా ప్రాక్టీసు కట్టిపెడతాడు. ఆ కూతలు మీరేం భరించగలరు ? అలవాటైన నేనే భరించలేను. . .'' అంటూ ప్రియ వాళ్ళన్నయ్య గదిలోకి దారితీసింది.

వాళ్ళన్నయ్య ఒక కుర్చీలో కూర్చుని ఫ్లూట్‌తో తంటాలు పడుతున్నాడు. కాళ్ళదగ్గర ఒక కుక్క పడుకుని ఉంది. చిత్ర విస్మయంగా కుక్కకేసి చూపులు సారిస్తున్నంతలో అతను వెనక్కి తిరిగాడు ఫ్లూట్ చేతిలో పట్టుకుంటూ. చిత్ర ఉలిక్కిపడింది.

''మా అన్నయ్య సారంగ, అది వాడి కుక్క రంభ. ఆ కుక్కన్నా, ఆ ఫ్లూటన్నా వాడికి భలే ఇష్టం. .'' అని చిత్ర పరిచయం చేస్తుంటే చిత్రకు నోట మాట పెగిలిరాలేదు. రంభట ! పూర్వశిని దొంగిలించి రంభ అని పేరు పెట్టుకున్నాడు కాబోలు ! పేరు మారిస్తే మాత్రం కుక్కనెలా మార్చగలడు? చిత్ర మనస్సు కుతకుతలాడి పోయింది. అయినా పైకి నమ్రతగా నమస్కారం పెట్టింది.

కళ ఏదో రెండు మాటలు మాట్లాడింది. ప్రియ ఇల్లంతా చూపిస్తాను రమ్మని ముందుకు నడిచింది. చిత్ర కావాలని వెనక్కి ఉండి పోయింది. వాళ్ళలా వెళ్ళగానే చిత్ర చురచురా చూస్తూ ''పోయిపోయి పూర కుక్కనే దొంగిలించుకు రావాలా ?'' అనేసి విసురుగా ప్రియ, కళ దగ్గరకి వెళ్ళిపోయింది.

సారంగ చిత్ర నోటి దురుసుతనం చూసి నివ్వెరపోయాడు. ఎన్నిసార్లు చెప్పినా మళ్ళా మొదటి ముక్కకే వస్తుందేమిటి ? భలే! గడుసుపిల్లలా ఉందే ? తనకు దొంగతనం అంటగడుతుందేమిటి? ఈ పిల్లకు ఎలా బుద్ధి చెప్పాలి ? కోపంతో సారంగ ముఖం జేవురించింది. గబాలున ఫ్లూట్ బల్లమీద పడేసి కుర్చీలో నుంచి లేచి నిలబడ్డాడు. . . .

ప్రియతో పాటు వాళ్ళు గదులన్నీ తిరిగి వస్తున్నారు. చిత్ర ఒంటరిగా కనబడుతుందేమోనని వోపిగ్గా చూశాడు సారంగ. కాని చిత్ర మళ్ళా అటువంటి అవకాశాన్ని ఇవ్వలేదు. గేటు తీసుకుని చిత్ర, కళ వెళ్తుంటే ఏం చేయలేక పళ్ళు కొరుక్కున్నాడు సారంగ.

* * *

చీకటి పడింది. చిత్ర బీచి నుండి ఇంటి ముఖం

పట్టింది. రోడ్డు కిరువైపులా బారులు దీర్చిన విద్యుద్దీపాలు దూరంగా 'వి' ఆకృతిలో కలుసు కుంటున్నాయి.

చిత్ర నడుస్తూ నడుస్తూ గభాలున 'అమ్మా!' అంటూ బాధగా జడపట్టుకుని వెనక్కి తిరిగి చూసింది. తన జడ గుంజిన మనిషెవరో కంగారుగా పారిపోయాడు. రౌడీ వెధవ ! కాకపోతే ఆడవాళ్ళ జడలు పట్టి గుంజటమేమిటి ? పోకిరీ వెధవకు ఎంత ధైర్యం! . . చటుక్కున చిత్రకు ఆ మధ్య తన వెంట బడిన మోహన్ జ్ఞాపకం వచ్చాడు. మోహన్‌తప్ప మరెవ్వరు చెయ్యగలరీపని ? సినిమా వాళ్ళు, నాటకాల వాళ్ళు అంటే తనకు పెద్ద మంచి అభిప్రాయం ఏదీ లేదు కాని బొత్తిగా ఇంత అన్యాయం అనుకోలేదు. ఈసారి మళ్ళా కనబడనీ !

చిత్ర తెలిగ్గా ఉన్న జడకేసి చూసుకుంది. ఇరవై రూపాయలు పెట్టి మధురనించి తెప్పించు కున్న సవరం. అది జడలో పెట్టి అల్లుకుంటే అచ్చం మామూలు జడలానే ఉండేది ! మళ్ళా అలాటిది ఎక్కడ దొరుకుతుంది ? పమిటతో జడ కప్పుకుని నీరసంగా ఇల్లు చేరుకుంది చిత్ర. . .

శేఖర్ గదిలో శారద ఇంగ్లీష్ పుస్తకం ముందేసు కుని చదువుకుంటున్నది. మంచం మీద బావ మూలుగుతూ పడుకున్నాడు. అది ఇంజక్షన్ల బాధో తెలీదు, వూర్వశి కోసం బెంగో తెలీదు. పక్కగదిలో కళ కుర్చీలో కూర్చుని తదేక దీక్షగా ఆలోచించు కుంటున్నది. చిత్ర అడుగుల సవ్వడి విని అటుచూసి కళ నిర్లిప్తంగా నవ్వింది. అతి దీనంగా ఉన్న చిత్రను చూసి కళ ఆశ్చర్యంగా అడిగింది ''ఏం జరిగింది చిత్రా ?'' అంటూ.

చిత్ర మెల్లిగా గొంతుక తగ్గించి చెప్పింది.

''సవరం. . . పోయింది. . . .''

కళ నవ్వింది.

''పోతే పోయింది లెద్దూ. దాని కోసం బెంగే మిటి ? కావాలంటే ఇంకోటి కొనుక్కోవచ్చు. . . ఇంతకీ ఎలా పోయింది?''

ఏం చెప్పటం ?

''రిబ్బనేం వేసుకోలేదు. . . ఎక్కడో జారి పోయింది. నేను చూసుకోలేదు. . . .'' అని చెప్పింది చిత్ర దిగులుగా.

''నీ జడ విశ్వేపంలా ఉంటుంది. చెప్తే వినవు కాని. . . .''

చిత్ర ఉక్రోషంగా అంది.

''నీజడంత పొడుగు నాకూ ఉంటే నేను నీలానే కబుర్లు చెప్పేదాన్ని !. . . మధుర నించి తెప్పించు కున్న సవరం. . . ఎంచక్క ఉండేది ! మళ్ళా అలాంటిది దొరకటం కష్టం. . . .''

పక్క గదిలో బావ మంచం మీద లేచి కూర్చు న్నాడు. చిత్ర గతుక్కుమంది బావ తన సవరం గొడవ విన్నాడేమోనని. _

రెండు మూడు రోజుల తర్వాత శేఖర్ సవరం సంగతి ఎత్తినప్పుడు చిత్ర మొదట సిగ్గుపడింది. తర్వాత కోపం కూడా వచ్చింది. కాని శేఖర్ అవేవీ పట్టించుకోకుండా ''చిత్రా ! నా ఫ్రెండొకడు మధుర వెళ్తున్నాడు. . . నీకు సవరం కావాలంటే తెప్పించి పెడతాను. . . .'' అన్నాడు.

చిత్ర ఆత్రుతగా అడిగింది.

# అయిదు రేళ్ళు

"నిజంగానా బావా ? మీ ఫ్రెండ్ మళ్ళా ఎప్పుడు తిరిగొస్తాడు ?"

"తొందర్లోనే తిరిగొస్తాడు. . . నాలుగైదు రోజుల్లో రావచ్చు. . . ."

చిత్ర కాస్సేపు నాలోచనగా ఊరుకుని తర్వాత తల అడ్డంగా తిప్పింది.

"వద్దులే బావా ! ఇప్పుడంత డబ్బు ఎక్కడ్నించి తేటం ?"

శేఖర్ ఏ మాత్రం తటపటాయించకుండా "డబ్బు సంగతి నీకెందుకు ? నేను తెప్పించి పెడతాగా ?" అన్నాడు ధీమాగా.

చిత్ర కృతజ్ఞత నిండిన కళ్ళతో శేఖర్‌కేసి మెప్పుగా చూసింది.

*   *   *

సాయంత్రంవేళ. ఉష ఎక్కడికో వెళ్ళింది. గీత ఇంటిపని పూర్తి చేసుకుని తీరిగ్గా కూర్చుంది. వీధిలో కాయితాలు కొనుక్కునే వాడు వెళ్తుంటే లోపలికి రమ్మని పిలిచింది. అలమారులో తెలుగు డైలీ పేపర్లు ఎత్తుగా పేరుకుని ఉన్నాయి. గీత వాటన్నిటిని క్రిందకు దించి వరండాలోకి తెచ్చింది. కాయితాల వాడు గోనె సంచిలో నుంచి త్రాసు గ్రాటికి తీసి ఒక పక్కన పడేశాడు. కాగితాల్ని చేతిలోకి తీసుకుంటూ నలిగిపోయిన వాటిని సవరిస్తున్నాడు.

"ఇంట్లో ఉంటారో, ఉండరో అని అనుమానిస్తూ వచ్చాను సుమండీ !"

గీత తలెత్తి చూసి సంతోషంగా నవ్వింది. మోహన్ నవ్వుతూ నిలబడ్డాడు. గీత కుర్చీ తెచ్చి వేస్తూ "కూర్చోండి ! ఎక్కడా కనబడ్డం మానేశారే ?" అంది.

"ఊళ్ళోలేను. వైజాగ్ వెళ్ళాను. . . ." అన్నాడు మోహన్ కుర్చీలో కూర్చుంటూ.

గీత కళ్ళు పెద్దవి చేసి చూసింది.

"వైజాగా ? నన్ను పెళ్ళొద్దని మీరెందుకు వెళ్ళినట్టు ?"

మోహన్ గీత చూడకుండా నాలిక కొరుక్కున్నాడు. . . .

సుధాకర్ ఉత్తరం చూశాక తన గుండె నీరైపోయింది. . . కళ సుధాకర్‌ను ప్రేమిస్తున్నదో, లేదో ? బావనే పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నదేమో ? వైజాగ్ వెళ్తే పరిస్థితి ఎలా ఉందో పసికట్టొచ్చు. అందుకని పని కట్టుకుని ఉత్తరం అందిన మర్నాడు వైజాగ్ చేరుకున్నాడు. గీతకు అనుమానం కలగకుండా మాటల మధ్యలో బావగాడి ఎడ్రస్ కనుక్కున్నాడు కాబట్టి సునాయాసంగా ఆ ఇంటి గుర్తుపట్టగల్గాడు. సి. ఐ. డి. పనిచేస్తున్నవాని ఇంటి ముందు తచ్చాడుతూ ఉండేటప్పటికి గీత చెల్లెలు వీధిలోకి వచ్చింది. చిత్రను చూసేసరికి తనకు కొండంత సంతోషం వేసింది. ఆ అమ్మాయిని మచ్చిక చేసుకుని మెల్లిగా పరిస్థితి ఏ విధంగా ఉన్నదీ తెలుసుకోవచ్చు ననుకున్నాడు. . . కాని చిత్ర గంభీరంగా ముఖం పెట్టి విసవిసా నడుస్తుంటే తనకు భయమేసి వెనక దిగాడు. . .

ఆ తర్వాత అనుకోకుండా కళ, శేఖర్ సినిమా హాల్లో కనిపించారు. కళ బావగాడితో సరదాగా కబుర్లు చెబుతున్నది. తన మనస్సు కలుక్కుమన్నది. సుధాకర్ గనుక ఈ దృశ్యం చూస్తే ప్రాణాలతో ఉంటాడా ?. . . సుధాకర్ ఇంక కళ మీద ఆశలు పెట్టుకోవటం నిష్ప్రయోజనం. వాళ్ళిద్దరికీ తన చేతులమీదగా పెళ్ళి చేయిస్తానని మాటిచ్చాడు తను. ఇప్పుడు సుధాకర్‌కు విషయం ఇలా ఉన్నదని ఏ ముఖం పెట్టుకుని వ్రాస్తాడు ? వైజాగ్ ఎందుకొచ్చానా అని తనను తాను తిట్టుకున్నాడు. వైజాగ్‌లో ఉండి తనింక చేయగల్గిందేమీ లేదు కూడా. అందుకని వెంటనే రైలెక్కి మద్రాసు చేరుకున్నాడు. పాపం ? సుధాకర్ ! బావగాడి అడ్డం ఎలా తొలగించటం ? ఏదో ఆలోచించాలి. . .

"మాట్లాడకుండా అలా చూస్తారేం ?" అంది గీత తీక్షణంగా చూస్తూ.

"అ !. . మా స్నేహితుడు తనతోపాటు వైజాగ్ రమ్మంటే వెళ్ళాను. . ." అంటూ క్రిందకు వంగి, ఒక పేపరు చేతిలోకి తీసుకున్నాడు.

"పేపర్లు అమ్ముతున్నారా ?"

"రెండు నెల్ల క్రితం నుంచి అలా పేరుకుపోయి ఉన్నాయి. వాటిని వదుల్చుకునేంత వరకు చిరాగ్గా ఉంది. . . ." అని జవాబిచ్చింది గీత చేత్తో పేపర్ల మీది దుమ్ము గట్టిగా దులుపుతూ.

మోహన్ ఇందాకటి పేపరు క్రిందపడేసి మరో పేపరు చేతిలోకి తీసుకున్నాడు. పేపరు తిరగేస్తూ చటుక్కున ఆగిపోయాడు.

"ఇది. . నా. . శా. . రా ?"

అంటూ వణుకుతున్న చేతులతో మోహన్ ఒక ఫోటోకేసి చూపించాడు.

గీత చూసింది.

'కనబడుటలేదు' శీర్షిక క్రింద అస్పష్టంగా ఒక ఫోటో ఉన్నది. పదిహేను, పదహారేళ్ళ వయస్సు అబ్బాయి ఫోటో అది.

"ఏముందక్కడ ? రోజు కిలాంటివి సవాలక్ష చూస్తూనే ఉంటాం. మీరెందుకలా వణుకుతారు ?" అంది ఆశ్చర్యంగా చూస్తూ.

మోహన్ నీరసంగా తల పట్టుకుని "అది నా ఫోటో !" అన్నాడు.

గీత మరీ ఆశ్చర్యపోయింది. మరొక మాటు ఫోటోకేసి తేరిపార చూసింది.

"మీకేం మతిపోలేదేమిటి ? చిన్న పిల్లాడి ఫోటో పట్టుకుని మీదేనంటారు ?" అంది.

మోహన్ తల మీది నుండి చేతిని తీసేశాడు. ఫోటో చుట్టూ చేత్తో గీస్తూ "ఇది నా ఫోటో అని చెప్తున్నాను. నమ్మండి !" అన్నాడు జాలిగా ప్రాధేయపడుతున్నట్టు.

గీత మళ్ళా నవ్వింది.

"సినిమా పత్రికల్లో ఫోటో క్విజ్‌లని వేస్తుంటారు చూశారా ? అలా మీ చిన్నప్పటి ఫోటో వేయించుకున్నారా ?"

మోహన్ నిట్టూర్చాడు.

"అది నేను వేయించుకోలేదండీ. మా నాన్న వేయించారు. . . మా నాన్నకి చెప్పకుండా నేను వూరికి పారిపోయొచ్చాను. . . ఉత్తరం వ్రాయను పంపిం

45 వ పేజీ చూడండి

మీ కృషియే దేశానికి సౌభాగ్యం

మీ పొదుపే రక్షణ నిధికి మదుపు

---



---

అతనిపేరు సత్యమూర్తి. అతనూ నేనూ కలుసుకోవడం, విడిపోవడం జరిగి తొమ్మిది సంవత్సరాలయింది. కాని ఇన్ని సంవత్సరాల కాలమూ, అతణ్ణి నా మనస్సునుంచి వేరు చేయలేపక పోయింది. ఆ రోజుల్లో అప్పుడే కొండదిగి, గమ్యంలేక, దారులు తెలియక, బాధ్యతారహితంగా గంతులువేస్తూ పోగే సెలయేరు నా వయస్సు. సెలయేరు లన్నిటినీ తనలో చేర్చుకొని మైదానంలో నిదానంగా, గంభీరంగా ప్రవహించే మహానది అతని వయస్సు. మా ఇద్దరి కలయిక కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో సంభవించింది.

అవి పరీక్ష రోజులు. పగలల్లా చదివి, సాయంత్రము విశ్రాంతికోసం లైబ్రరీవైపు బయలుదేరాను. వసంతాగమనాన్ని సూచిస్తూ కోయిలలు మధురంగా కూస్తున్నాయి. లైబ్రరీవైపు దారికి రెండువైపులా మామిడిచెట్లు. మామిడిపువ్వుల సువాసన మత్తుగా నాసికని సోకుతోంది. చెట్ల నిండా లేత మామిడికాయలు గాలికి ఊయలలూగుతున్నాయి. అప్పటికి కొద్దిగా చీకటి పడింది. నా కెదురుగా ఒకాయన పుస్తక మొకటి చంకలో పెట్టుకొని మైదానం నుంచి వస్తున్నాడు. నన్ను చూసి చిన్నగా నవ్వి "చీకటి పడింది. అక్షరాలు మరి కనుపించక హాస్టలుకి పోతున్నాను" అన్నాడు తెలుగులో.

"ఒక అరగంట పోతే నేనూ వచ్చేస్తాను రండి. కాస్సేపు అలా తిరుగుదాం" అన్నాను.

తోవలో "మీరు ప్రైవేటుగా కూర్చుంటున్నారా పరీక్షకి ?" అన్నాను.

"అవునండి. చాలా సంవత్సరాల క్రితం ఈ పరీక్షలో కూర్చొని తప్పేను. మళ్లీ ఇన్నాళ్లకి పూర్తి చెయ్యాలని బుద్ధిపుట్టి ఈ ముసలి కాలంలో మీతో పోటీ పడడానికి వచ్చేను" అన్నాడు నవ్వుతూ. అతను చాలా హాయిగా హృదయంలోంచి నవ్వుతాడు. నన్ను అయస్కాంతంలా ఆకర్షించిందా నవ్వు.

"అదేమిటండోయ్ ! అప్పుడే ముసలివాణ్ణయే నంటున్నారు ? భలేవారే !" అన్నాను.

"మీ వయస్సుతో పోలిస్తే ముసలివాణ్ణే. నా కిప్పుడు నలభై ఏళ్లున్నాయి. కొందరు ఎంత వయస్సు వచ్చినా ఇంకా లేతగానే కనుపిస్తారు. నాకా అదృష్టంలేదు. నన్ను ఎవరైనా చూడగానే ఖచ్చితంగా ఇతనికి నలభైఏళ్లు ఉంటాయి అని అంచనా కట్టేస్తారు. అవునా మరి ?" అన్నాడు.

"కావచ్చు. కాని నలభై ఏళ్లకే ...." నసిగేను.

"మీ రన్నది బోధపడింది. నలభై సంవత్సరాలకి జీవితం ప్రారంభించినవాళ్లున్నారు. నాలాటివాడు జీవితంలోని అన్ని పాఠాలని నేర్చేసుకుని తల పూర్తిగా నెరసినవాళ్లూ ఉన్నారు ..... క్షమించండి. నా మాటలతో మిమ్మల్ని ఎటో లాగుతున్నాను. నా వయస్సు మీ కొచ్చేసరికి ఇంకా ఇరవై సంవత్సరాలు పడుతుంది. అప్పటి చింత ఇప్పు డెందుకు ? ప్రస్తావన మారుద్దాం." అన్నా డతను.

"మీ రెక్కడనుంచి వస్తున్నారు ?" అన్నాను.

"అలహాబాదు. అక్కడొక ప్రైవేటు రోడ్డు ట్రాన్స్‌పోర్టు కంపెనీలో మేనేజరుగా ఉన్నాను. నాపేరు సత్యమూర్తి."

నేను కూడా నా పరిచయం చెప్పుకున్నాను.

"నేను తెలుగువాణ్ణని మీకెలా తెలుసు ?" అన్నాను.

"మీరు ఆంధ్రా మెస్‌లో భోజనం చేస్తుంటే చూసేను" అన్నాడు. ఆ రాత్రి నాతోనే భోజనం చెయ్యమన్నాను.

అలా ప్రారంభమైన మా పరిచయం పరీక్షలు పూర్తయ్యేసరికి గాఢంగా అల్లుకుంది. పరీక్షలయిపోయిన మర్నాడు ఆయన ప్రయాణం. అలహాబాదు పోయే బండిలో ఆయనకు వీడ్కోలు యిచ్చేను. "మళ్లీ ఎప్పుడు దర్శనం ?" అన్నాను.

"మీ రెప్పుడు తలుచుకుంటే అప్పుడే. అలహాబాద్‌కీ, కాశీకి ఎంతదూరమని ? ఇక్కడ మీరు చూపిన ఆదరణకి చాలా థాంక్స్" అన్నా డతను.

"థాంక్స్ చెప్పుకోవాల్సింది నేను. మీరు పొగడ్త అనుకోకండి. ఈ పదిరోజులూ మీ దగ్గర పుస్తకాల్లో లేని విషయాలు చాలా నేర్చుకున్నాను." అన్నాను.

"అలహాబాదు రండి. మీ చదువు పూర్తి చేసేస్తాను" అన్నాడు నవ్వుతూ.

వేసంగి సెలవుల్లో నేను దక్షిణ దేశయాత్ర పెట్టుకున్నాను. తీర్థయాత్రల్నీ, పాత పరిచయాల్నీ కలుపుకుంటూ చేసిన ప్రయాణాల్లో విశేషాల్ని ఆయనకి రాస్తుండేవాణ్ణి. శెలవలు పూర్తయ్యాయి. మళ్లీ విశ్వవిద్యాలయంలో నా ఆఖరు సంవత్సరం చదువుకోసం కాశీ చేరుకున్నాను. నేను హాస్టలులో దిగిన మర్నాడు ఆయనకి మరో ఉత్తరం రాసేను. నాలుగోనాడు జవాబు వచ్చింది.

". . . . మీ దక్షిణ దేశయాత్ర ఉత్తరాలు చదువుతూంటే నాకు ఏనుగూ, నలుగురు గుడ్డివాళ్లూ కథ జ్ఞాపకం వచ్చింది. "బెజవాడలో హోటలు వసతి సరిగా కుదరలేదు. బృందావన్ ఎక్స్‌ప్రెస్‌లో రిజర్వేషన్ దొరకలేదు. బెంగుళూరు నుంచి మైసూరుకి రానూపోనూ 110 రూపాయలు టాక్సీవాడు తీసుకున్నాడు. తిరుమలలో దేముడి దర్శనం చేస్తుంటే నా జేబులోని పర్సు ఎవడో కొట్టేశాడు. నా అదృష్టం బాగుండి అందులో అయిదు రూపాయలే ఉన్నాయి. కాబట్టి బతికిపోయేను..." అంటూ రాసేరు. అదే బహుశః ఏ సౌందర్యోపాసకుడే అవుతే బెజవాడలో సంధ్యా సమయాన కృష్ణానదీతీరాన్ని వర్ణించేవాడేమో ! హంపీ శిథిలాలని చూస్తుంటే గతించిన ఆంధ్ర చరిత్ర జ్ఞప్తికి వచ్చి కళ్లు చెమర్చాయి అనీ, మైసూరులో బృందావన్ గార్డెన్స్ దేవలోకంలోంచి దిగివచ్చిన నందనవనంలా ఉందనీ రాసేవాడేమో ! తిరుమల కొండమీది నుంచి కనుపించే చంద్రగిరివైపు లోయలోని ప్రకృతి సౌందర్యాన్ని పొగిడేవాడేమో !

"ఇప్పుడు మీరు నన్నడగబోయే ప్రశ్న నాకు తెలుసు. "అయితే సత్యమూర్తిగారూ ! మీరయితే ఏం చేసేవారూ ?" అని అంతే కదూ ? చిన్నతనం నుంచి నాకు జీవితంలోని తమాషాలని చూడడం అంటే బలేసరదాగా ఉండేది. ఎవడె నా కల్లు తాగేడంటే వాడెలా మాట్లాడతాడో, ఎలా తూలుతాడో చూసేవాణ్ణి. ఎక్కడైనా పెళ్లి జరుగుతుంటే పెళ్లి పందిరిలో కూర్చున్న వాళ్ల మాటలన్నీ వింటుండేవాణ్ణి. ఒకసారి ఎవడో ఖూనీ చేస్తే వాడెలా ఉంటాడో చూద్దామని మా ఇంటికి రెండు మైళ్ల దూరంలో ఉన్న పోలీసుఠాణాకి పరుగెత్తేను. మా వూరికి సర్కసు వచ్చింది. అందులో బఫూను వేషం వేస్తున్న ఒకాయనతో స్నేహం చేసేను. సర్కస్ మా వూళ్లో ఉన్నన్నాళ్లూ ఆ సర్కస్ వాళ్ల డేరాలలోనే అస్తమానం ఉండేవాణ్ణి. నాది అదొక తృష్ణ. మీరు దక్షిణ దేశమంతా తిరుగుతున్నారని విని అసూయ పడ్డాను. ఆ అవకాశం నాకు దొరుకుతే ఎంత బాగున్నని. బహుశః మిమ్మల్ని విసిగిస్తున్నానేమో ! ఇక ఆపేస్తాను. ఈ ప్రవాసంలో మధ్యమధ్య తెలుగులో ఉత్తరాలు వస్తూంటే అదో ఉత్సాహంగా ఉంటుంది.

మీ మిత్రుడు. . . ."

ఆ లేఖ చదివిన తర్వాత నా ఉత్తరాలధోరణి మార్చేను. ఆయన చాలా ఉత్సాహంగా జవాబులు రాసేవాడు. దసరా పండుగ తర్వాత నా జవాబులు కొంచెం ఆలస్యంగా రాసేవాణ్ణి. సంక్రాంతి తర్వాత తీరుబడిలేక అతనికి ఒక ఉత్తరం కూడా రాయలేదు. యూనివర్శిటీ పరీక్షలు అయిపోయిన మర్నాడు ప్రయాణానికి సిద్ధమవుతూంటే అతని దగ్గర నుంచి ఒక లేఖ వచ్చింది.

". . . . మీరు పేపర్లన్నీ చాలా బాగా రాసి ఉంటారని ఆశిస్తాను. మీరు ఈ వేసవి శెలవుల్లో తప్పక అలహాబాద్ రావాలి. మీతో నాకు చాలా పనుంది. ఆ అవసర మేమిటో మీరీ వూరువచ్చేక చెబుతాను. మీ రాక కోసం వెయ్యి కళ్లతో ఎదురు చూస్తూ. . . . మీ మిత్రుడు." మరింకేమీలేదు. ఏ బండిలో వస్తున్నానో అతనికి ముందుగా ఉత్తరం రాసి అలహాబాదు ప్రయాణ మయేను.

ప్లాటుఫారం మీద రైలు ఆగగానే నాకు మొట్టమొదట కనిపించింది అతని ముఖం. చిరునవ్వుతో చెయ్యి వూపేడు. అతని పక్కనే ఒకామె నిల్చుని ఉంది. కోలముఖం, నవ్వుతున్న విశాల నేత్రాలు, విశిధివంటి కనుపాపలు— నా జీవితంలో అంతటి అందమైన స్త్రీని నే నిదివరకు చూడలేదు. సిగ్గువిడిచి ఆమెవైపు అలా చూస్తూ నిల్చుండి పోయేను.

"ప్లాటుఫారం మీదకి దిగండి. సామాను దింపేస్తాను" అని వినిపించిందాయన గొంతుక. నేనా ఉన్మత్తతలోంచి తేరుకొని కిందకి దిగేను. "ఈమె నా మరదలు— పేరు సీత" అని ఆమెను పరిచయం చేసేడు సత్యమూర్తి.

"నమస్కారం" అన్నాను.

"నమస్కారం" ఆ గొంతుక నా మనస్సులో ఒక మోహన రాగాన్ని మేలుకొలిపింది.

టాక్సీలో ఆయన ఇంటికి వెళ్లేం. నా సామాను ఒక గదిలో పెట్టించేడు. పక్క గదికీ ఈ గదికీ మధ్య ఒక తెర ఉంది. ఆ తెరవైపు చూస్తూ "ఇదుగో. . . మా స్నేహితుణ్ణి తీసుకొచ్చాను" అన్నాడు.

"నీళ్లు వేడి చేయించేను. స్నానం చెయ్యమనండి" అని ఒక స్త్రీ కంఠం వినిపించింది. అవతలి నుంచి. నేను స్నానం చేసేక ఆయనా, నేనూ భోజనానికి కూర్చున్నాం. సీత మా ఇద్దరికీ వడ్డించింది. వడ్డించినప్పుడల్లా ఆమె నేత్రాల్ని చూసే

వాణ్ణి. భోజనానంతరం ''వంట ఎలాగుంది ?'' అని అడిగేడు.

''అమృతంలాగుంది'' అన్నాను సీత వైపు చూస్తూ. ఆమె నవ్వింది. ''భేష్ ! తెలుగువంట అమృతం లాగుంది అన్నవాణ్ణి ఇన్నాళ్ళకి చూసేను. నా హిందూస్థానీ స్నేహితులు ఎవర్నడిగినా హాలా హలంలాగుంది అంటారు. సీతా ! నీ వంటని మెచ్చుకున వాడు ఇన్నాళ్ళకి ఒకతను కనుపించేడు.!'' అన్నాడు. టేబిలుమీద రెండు మామిడిపళ్ళరసం గ్లాసు లున్నాయి ఇద్దరం చెరోగ్లాసూ ఎత్తి ఖాళీచేసేం.

''అమృతం!'' అనాడ్నతను. ''ఛి బావా!'' అని ఆమెలోపలికి పారిపోయింది. ఇద్దరం గ్లాసులు ఖాళీ చేసేం.

''ఎలాగుంది ?'' అన్నాడు.

''చాలా తియ్యగా ఉంది'' అన్నాను.

''అయితే పెళ్ళిచేసుకుంటావా ?''

నాకు తెలవారింది. తలమీద చేతితో గట్టిగా రెండుసార్లు కొట్టుకున్నాను. పెళ్ళికూతురులా తలవంచుకున్నాను.

''ఇదే మీ కుర్రాళ్ళతో వచ్చిన చిక్కు. ఏ షాక్ వచ్చినా తట్టుకోలేరు. సరే. కాస్సేపు పడుక్కో. ఏకవచన ప్రయోగం ఎలాగూ చేసేను కాబట్టి అలాగే ఇక మీదట నిన్ను పిలుస్తాను. సాయంత్రం మళ్ళీ మాట్లాడుకుందాం'' అని వెళ్ళిపోయేడు.

పడుకున్నాను గాని నిద్రపట్టలేదు. ఆ రోజే మిటి ? తర్వాత వారం రోజులూ నాకు సరిగ్గా నిద్ర పట్టలేదు. ఎనిమిదో రోజు సాయంత్రం ఇద్దరం ఒక పార్కులో కూర్చున్నాం.

''నువ్వెందుకూ పనికిరావు'' అన్నాడు.

''ఏం ?'' అన్నాను.

# శిశిరంలో వసంతం

''నిన్ను పెళ్ళిచెసుకుంటుందో లేదో సీతని అడిగావూ ?''

''లేదు''

''మరేం చేస్తున్నావు ఈ వారం రోజులూ ? అన్నాను కదూ ఈ కాలం కుర్రాళ్ళు ఎందుకూ పనికిరారని ! ఇదే నేనైతేనా. . . . !''

''నాకు ధైర్యం చాలడం లేదండి'' అన్నాను.

అతనో నిట్టూర్పు విడిచేడు. ''సరే అయితే. రేపు ఎక్జిబిషన్‌కి వెళదాం. అక్కడ మీ ఇద్దర్నీ వదిలేసి నేను ఇంటికి పోతాను. ఏవేవో ప్రేమ కబుర్లు చెప్పు. అప్పుడప్పుడు చేతులు కలుపు. ఆమె ఎంత అందంగా ఉందో పొగుడు. ఆమెకో చీర కొని పెట్టు. తర్వాత సంగతి చూద్దాం'' అన్నాడు.

మర్నాడు సాయంత్రం తనగదివైపు చూస్తూ ''ఇగో. . . మేము ఎగ్జిబిషన్‌కి వెళుతున్నాం. వెళుతున్నాం. వచ్చేసరికి కాస్త ఆలస్యం అవుతుంది'' అన్నాడతను. గదిలోంచి ''సీతా ! ఆ నెక్లెస్ ఒక్కటే పెట్టుకో జాగ్రత్త. ఈ ఎగ్జిబిషన్‌లలో రద్దీ ఎక్కువగా ఉంటుంది'' అని లోపలి నుంచి అతని భార్య గొంతు వినిపించింది.

''అలాగే అక్కయ్యా.'' అంది సీత.

''మీరోమాటు లోపలికి రండి'' అందామె. సత్యమూర్తి గదిలోకి వెళ్ళేడు. వారం రోజు లయింది. నే నింతవరకు ఆమెను చూడలేదు. ఇతడి మరదల్ని నేను పెళ్ళిచేసుకోవాలి. భార్యని మాత్రం నేను చూడకూడదు. ఏం ఆదర్శం ! అనుకున్నాను. సత్యమూర్తి గది బయటికి రాగానే—

''ఆమె రారా ?'' అన్నాను అమాయకంగా మొఖంపెట్టి. అతను కొంచెం తత్తరబాటు చెందేడు,

''ఎవరు ? ఓహో! మా ఆవిడా? ఆమెకు ఒంట్లో బాగులేదు. పదండి పదండి'' అన్నాడు హడావిడిగా ముందుకు నడుస్తూ. ఎగ్జిబిషన్‌లో జనసమ్మర్దం ఎక్కువగానే ఉంది. ఒక అరగంట అటూ ఇటూ తిరిగేమో లేదో సత్యమూర్తి మరి కనుపించలేదు.

''బావేడి ?'' అంది సీత.

''ఏమో !'' అన్నాను నేను. ''సత్యమూర్తి గారూ !'' అని గట్టిగా రెండుసార్లు కేకవేసేను. అటూ ఇటూ వెదికేం. ఆయన కనుపించలేదు. ''మీ బావ లేకపోతేనేం ? నేనున్నానుగా ! మనిద్దరం హాయిగా తిరుగుదాం పద'' అని అందామని నోరు విప్పి ''పోనీ ! ఇంటికి పోదామా ?'' అన్నాను. నీరసంగా.

''ఎందుకూ ? మీ సరదా అంతా చెడిపోతుంది. మనిద్దరం తిరుగుదాం పదండి'' అన్నది సీత.

ఈ మారు ఆమె నాకు బాగా చేరువగా నడవడం ప్రారంభించింది. అప్పుడప్పుడు ఆ దొమ్మిలో మా ఇద్దరి భుజాలూ తగులుతుండేవి. అటువంటి సమయాల్లో అనుకునేవాణ్ణి ''ఈ ఒక్క క్షణం నాకీ చొక్కా,ఆమెకా రవికా లేకపోతె ఎంతబాగుణ్ను!'' అని. అలా తిరిగి తిరిగి బట్టల దుకాణంలో దూరాం. ''నాకో నెక్‌టై కొని పెట్టండి'' అందామె.

''మీకు నెక్‌టై ఎందుకు ?'' అన్నాను నవ్వుతూ

''ఒకతనికి ప్రెజంటు చెయ్యాలి''

''అయితే ఒక షరతు. మీకు నేనో నెక్‌టై ఎంచి పెడతాను. నాకు మీరో చీర ఎంచాలి'' అన్నాను.

''ఓ ! అలాగే'' అంది.

నేనెంత వద్దంటున్నా వినక నెక్‌టై ధర ఆమె ఇచ్చింది. చీర ఖరీదు నేనిచ్చాను. రాత్రి తొమ్మిది గంటవుతోంది.

''ఇక ఇంటికి పోదామా ?'' అంది.

''పదండి'' అన్నాను.

''దొమ్మి మరీ ఎక్కువగా ఉంది. నా చెయ్యి పట్టుకోండి. లేకపోతె మనం కూడా విడిపోతా మేమో!'' అంది సీత. ''తెలుగు భాషలోని తియ్యదనం అంటే ఇది !'' అనుకున్నాను నేను. ఆమె చేతిని నా చేత్తో గట్టిగా పట్టుకున్నాను. ఎగ్జిబిషన్ ముఖద్వారం ఎప్పుడు దాటేమో కూడా నాకు స్పృహలేదు. ''ఇక నా చెయ్యి వదలండి'' అందామె నవ్వుతూ.

''ఊహు !'' అన్నాను.

''ఏం ?''

''వదులిస్తే ఈ ఇంద్రజాలం మాయ మవుతుంది. ఇప్పుడే అమరలోకంలోనో విహరిస్తున్న నన్ను మళ్ళీ ఈ భూలోకంలో పడేయకండి.''

''ఓహో ! మీరు కవిత్వంలో పడ్డారే !'' అంది నవ్వుతూ. నా చేతిని సున్నితంగా విడిపించు కుంది.

''మీరు ఆ రెండో లోకంలో ఉన్నప్పుడు మీ చెతి చేమట అంతా నా చేతి కెక్కించేరు. చూడండి'' అంది చెయ్యి చూపిస్తూ.

''వెరీ సారీ ! ఉండండి'' అని నా చేతిరుమాలు తీసి ఆమె చెయ్యి తుడిచాను.

''థాంక్స్'' అని కిలకిల నవ్వింది.

''అలా నవ్వకండి'' అన్నాను.

''ఏం ?''

''ఆ నవ్వు నా గుండెని కోస్తోంది.''



‘‘మీ గుండెని కాదు. మీ కడుపుని. నాకు ఆక లేస్తోంది. చప్పున ఇంటికి పోదాంరండి’’ అంది ముందుకు నడుస్తూ.

ఇంట్లో సత్యమూర్తి కనుపించేడు. ‘‘ఎక్కడికి పోయేరు మీరిద్దరూ ? పిలిచి పిలిచి నా గొంతుక అరుచుకుపోయింది. అవునూ ! ఇద్దరూ చట్టాపట్టా వేసుకు తిరుగుతుంటే మీ మధ్య ఈ మూసలా టెందుకూ?’’ అన్నాడు అలిగినట్టు ముఖం పెట్టి.

‘‘ఎందుకలా ఉడుక్కుంటావు బావా ? నీకోసం మంచి ప్రెజెంటు తెచ్చేనులే !’’ అంది సీత.

‘‘వెరీగుడ్ ! అయితే భోజనాలకి లేవండి.’’ మీ కోసం వంటంతా చేసేసి సిద్ధంగా ఉంచేం!’’ అన్నాడు.

‘‘ఓహో ! ఏమేం వంటకాలు చేసేరేమిటి ?’’ అంది సీత.

‘‘అన్నం, కందిపొడుం, ఆవకాయ, మజ్జిగ !’’ అన్నాడు చాలా సీరియస్‌గా.

భోజనాలయేక ‘‘అలా వీధిలోకి వెళ్ళి కిళ్లీలు వేసుకుందాం పద’’ అన్నాడు సత్యమూర్తి నాతో. ఇల్లు దాటగానే అడిగేడు.

‘‘ఎంతవరకొచ్చింది కథ ?’’

‘‘ఏమో ! ఆమె చాలా పెంకిదండీ ! అటూ తేల్చదు. ఇటూ తేల్చదు.’’ అని జరిగిందంతా చెప్పేను.

‘‘అప్పుడే హేమ్లెట్‌లా మొఖం పెట్టకు. ఇదంతా ఉపోద్ఘాత మన్నమాట. చెయ్యి చెయ్యి తగిలించి కొంత కరెంటు ఎక్కించావు గదా ?’’ అన్నాడు.

‘‘కరెంటు కాదు. చెమట ఎక్కించేవు అంది!’’

‘‘అదే చమత్కారం అంటే. లేకపోతే పదహారేళ్ల కన్నెపడుచు నువ్వు చెయ్యిపట్టుకోగానే నీ మీద వాలిపోతుందనుకున్నావా ? ఇందులో ఎన్ని సాధక బాధకాలున్నాయి ! నువ్వు ప్రెజెంటు చేసిన చీర పుచ్చుకుంది. నువ్వు చెయ్యి పట్టుకుంటే ఊరుకుంది. నేను వెంట లేకపోయినా నీతో ఒంటరిగా తిరిగింది. అవునా ? ఇక రెండో కార్యక్రమం విను రేపు రెండు సినిమా టిక్కెట్లు కొంటాను. బాల్కనీలో వెనక వరసలో. ఇంగ్లీషు సినిమా. కనుక హీరోకి హీరోయిన్‌కి మధ్య రెండు మూడు మాటైన సీనులు తప్పకుండా ఉంటాయి. ఏమంటావు ?’’

‘‘అలాగే’’ అన్నాను. మర్నాడు సాయంత్రం సత్యమూర్తి నాతో ‘‘మంచి ఇంగ్లీషు సినిమా ఒకటి నడుస్తోంది. రెండు టిక్కెట్లు రిజర్వు చేసేను. వెళదాం పద’’ అన్నాడు సీత ఎదురుగా.

‘‘సరే. పదండి’’ అన్నాను. ఇద్దరం బట్టలు తొడుక్కుంటుంటే టెలిఫోన్ మోగింది. సత్యమూర్తి రిసీవర్ ఎత్తేడు.

‘‘ఎవరూ ?. . . ఓహో. . . మీటింగా ?. . . ఇప్పుడా ?. . నో...నో నా కో సినిమా ప్రోగ్రాం ఉంది సార్ ! ఒక స్నేహితుడితో వెళుతున్నాను. చంపేసేరే ! రేపటికి పోస్ట్‌పోన్ చెయ్యకూడదూ ?... సరే ఉంటే.’’ అని ఒక పెద్ద నిట్టూర్పు విడిచి రిసీవరు దించేసేడు. ‘‘విన్నావుగా ? ఈ ప్రపంచంలో మరుక్షణంలో ఏమవుతుందో చెప్పలేం కదా ?’’ అన్నాడు నా వైపు తిరిగి. ‘‘పోనీ సిన్నొక్కణ్ణే పంపిద్దామంటే ఆ సినిమాహాలు ఇక్కడికి మూడు మైళ్ల దూరంలో ఉంది. ఇప్పుడేం చెయ్యడం ? సీతా ! ఇక నువ్వే శరణ్యం. నువ్వు నా జాగాలో వెళ్లక తప్పదు’’ అన్నాడు సీతవైపు చూసి.

‘‘నేను వెళ్లను బాబూ !’’ అంది సీత.

‘‘అదేమిటి ? ఆయనేదో పాపం సరదాగా మన వూరువస్తే, ఆయనని ఇంట్లో కూచోపెడితే ఏం మర్యాదా ?’’ అని తెరవెనక నుంచి గొంతుక వినిపించింది.

‘‘పోనీలెండి. ఆవిడకి నాతో రావడం ఇష్టం లేకపోతే బలవంతం ఎందుకూ ?’’ అన్నాను.

‘‘అబ్బెబ్బె. అదేదీ కాదండి. వూరికే అన్నాను. వస్తానుండండి’’ అని గదిలోకి వెళ్లింది సీత. సత్యమూర్తి వెళ్ళిపోయేడు. మరో పదిహేను నిముషాలకి సీత నా కెదురుగా నిల్చుంది. నేను క్రితం రాత్రి కొని ఇచ్చిన చీర కట్టుకుంది. ఆమెవైపు విదాయించి చూసి ‘‘నే నిప్పుడే లోకంలో ఉన్నాను ?’’ అన్నాను కళ్లు నులుముకొని. ఆమె చెక్కిళ్లు ఎరుపెక్కాయి.

‘‘పదండి. ఆలస్యం అవతోంది’’ అంది వేలవైపు చూస్తూ.

‘‘టిక్కెట్టు దిష్టి తగులుతోంది’’ అన్నాను.

## ఉడుతా! ఉడుతా!!

రావె రావే రావె ఉడుతా
నీవు కోరిన వన్ని పెడతా
కుచ్చుతోకా ఊపుకొంటూ
వచ్చిపోవే ఒక్కమాటూ

జామపండూ తెచ్చి పెడతా
చక్కకేళీ తెచ్చి పెడతా
వీపుపై గల మూడు గీతలు
చూపుమా ముదమలర నాకూ

శనగపప్పూ తెచ్చి పెడతా
సన్నబియ్యం తెచ్చి పెడతా
చేతులెత్తీ నమస్కారం
చేసిపోవే ఒక్కసారీ

తోకలాగీ హింసపెట్టను
కేకలేసీ బెదరగొట్టను
గోముగా నీ వీపు నిమిరెద
ప్రేమతో నిండేను నా యెద

రామచంద్రుని మీది భక్తిని
రాతివంతెన కట్టినావట !
నాకు నంతెన లేమివద్దూ
నాకు నీ గంతుల్లె ముద్దూ

అలపర్తి వెంకటసుబ్బారావు

‘‘తిరుపతి ఉప్మాలు, మరపకాయలూ తీసుకొచ్చేదా?

‘‘అబ్బ. నేను వూళ్లో ఉన్నన్నాళ్లూ మీరెన్ని సార్లు దిష్టి తీయించుకున్నా లాభం లేదు.’’

‘‘మీరు కదుల్తారా, కదలరా ?’’

‘‘కదులుతున్నా హుజూర్ !’’

సినిమా అవుతూంటే ఆమె చేతిమీద నా చెయ్యి ఉంచేను. మెల్లగా ఆ చేతిని వెనక్కి తీసేసుకుంది. కాస్సేపయేక ఆమె భుజం మీద నా చెయ్యి వేసేను. ‘‘మీరిలా అల్లరిచేస్తే నే నింటికి వెళ్ళిపోతాను.’’ అంది మెల్లిగా. చెయ్యి వెనక్కి తీసుకోక తప్పలేదు. సినిమా అయిపోయిన తర్వాత నేను బుంగ మూతితో హాలు బయటికి నడిచేను. ఆమె నా వైపు జాలిగా చూసింది. ఇంటికి వచ్చేదాకా తోవలో నాతో ఏదేదో మాటాడాలని ప్రయత్నం చేసింది. నేను జవాబియ్యలేదు. సత్యమూర్తి ఇంకా ఇంటికి తిరిగి రాలేదు. నేను సరాసరి నా గదిలోకి వెళ్ళి చీకట్లో మంచం మీద పడుకున్నాను జోళ్లైనా విప్పకుండా.

నా గదిలోకి అడుగుల చప్పుడైంది. ఎవరో లైటు వెలిగించేరు నా మంచానికి దగ్గరగా నడిచేరు. ‘‘నా మీద కోపం వచ్చిందా ?’’

నేను జవాబియ్యలేదు. ‘‘మీ బాధ నాకు తెలుసు కాని మిమ్మల్నెలా ఓదార్చాలో నాకు తెలియదు. బహుశః మీరీవూరు రాకపోతేనే బాగుణ్ణేమో! ఒకవేళ తెలియక నేను చేసిన తప్పులేవైనా ఉంటే నన్ను క్షమించండి. ’’ అని లేచి వెళ్ళిపోతోంది.

‘‘వెళ్లకు సీతా! నువ్వు లేకపోతే నేను బతకలేను. ఇటు చూడు. నేను ఎం.ఎస్.సి పాసవబోతున్నాను. మావాళ్లకి బోలెడు ఆస్తి ఉంది. నిన్ను కష్టం లేకుండా చేసుకుంటాను. నాకేం తక్కువని నువ్వు నన్నుకాదంటున్నావు?’’ అన్నాను బతిమాలుకుంటూ. గుమ్మం దగ్గర ఆగి వెనక్కి తిరిగింది. ‘‘ఈ ప్రపంచంలో ఏ నాడైనా ఆడదాని ప్రేమని పురుషుడు కొనుక్కోగలిగేడా? మీరు చదువుకున్న వాళ్లు! సంస్కారం గల వారు. ఆలోచించండి.’’ ఆమె వెళ్ళిపోయింది.

మర్నాడు రాత్రి ఆరుబోబాదు ప్లాటుఫారానికి కాస్త దూరంలో ఉన్న బోగీలో అతను, నేనూ కూర్చున్నాం. కంపార్టుమెంటులో మరెవరూ లేరు. వసంత ఋతువు వెళ్ళిపోయినా గ్రీష్మం ఇంకా ప్రవేశించలేదు. చల్లని గాలి నా శరీరాన్ని కొరుకుతోంది. దగ్గర్లోని మామిడి చెట్టు మీదనుంచి కోయిల కూత ఒకటి కటోరంగా వినిపిస్తోంది. తూర్పు దిక్కున ఆకాశం మీద చతుర్దశి చంద్రుడు మచ్చకాసెర్లలో రోగిలా కనుపిస్తున్నాడు.

‘‘నేను నీకు చాలా అన్యాయం చేసేను’’. అన్నాడు సత్యమూర్తి ఒక నిట్టూర్పు విడిచి. ‘‘నీకు విషయాలన్నీ మొట్ట మొదటే విడమర్చి చెప్పి ఉంటే ఇన్ని గొడవలు రాకపోను. నేను చెప్పేది శ్రద్ధగా విను. విన్న తర్వాత నా ప్రవర్తన మీద నీ తీర్పు చెప్పు.

‘‘అయిదు సంవత్సరాల క్రిందట నాకు ఇద్దరు పిల్లలుండేవారు. నా భార్య సీత అంత అందమైనదని అనను గాని ఆమెను రోడ్డు మీద ఒకసారి చూసినవాడు మరొకసారి వెనక్కి తిరిగి తప్పక చూసేవాడు. ఆ రోజుల్లో నా జుట్టు నల్లగా తుమ్మెదరెక్కల్లా ఉండేది. నమ్ముతావా? నవ్వుల్లో మరికొంచెం వచ్చింది.

మా కుటుంబం వీధిన పడింది. నా ఇద్దరు పిల్లల్నీ ఈ చేతుల్తో పాతి పెట్టేను. నా భార్య చచ్చి బతికింది. కాని ఆమె ముఖమంతా ఖాళీ లేకుండా లోతైన గాట్లు — రెండు కళ్ళూ పోయేయి."

నేను షాక్ తిన్నవాడిలా లేచి కూర్చున్నాను.

"మాట్లాడకు. నేను చెప్పేదంతా పూర్తిగా విను ముందు" ఏదెంత సేపూ మరదల్నే నాకు చూపిస్తున్నాడు. తన భార్యని పరిచయం చెయ్యడేం? అని నువ్వనుకుంటున్నావని నాకు తెలీదా? తెలుసు. అంతే ఇదివరకే నీకు చెప్పేనుగా నా కిటువంటి తమాషాలంటే సరదా అని? ప్రవాసంలోని అంధ్రుణ్ణి. కళ్ళు పోగొట్టుకున్న భార్య— గంపెడు దుఃఖంలో ఉన్న భార్య. ఆమెనెలా ఓదార్చేది? ఆయాలూ, నౌకర్లూ ఆమెను సరిగ్గా చూస్తారా? కష్టం సుఖం కనుక్కోడానికి ఇరుగూ, పొరుగూ ఒక్క తెలుగు కుటుంబమైనా లేదు. మా ఆవిడకి ఈ నాటికీ తెలుగు తప్ప మరో భాష రాదు. అప్పుడు దేశంలో ఉన్న మామగారికి నా పరిస్థితి రాసుకున్నాను. నా తరఫువారెవ్వరూ లేరు. ఆయన సీతని తీసుకొని వచ్చేరు. కొన్నాళ్ళక్కడ ఉండి సీతని మా దగ్గర వదిలి పెట్టి వెళ్ళిపోయాడు.

"నాటికి నేటిదాకా నా భార్య ఆ గది బయటకి రాదు. ఆమెకు జీవితం మీదే విరక్తి పుట్టింది. సీత లేకపోతే నాకో క్షణం గడవదు. నాలుగు సంవత్సరాలు గడిచేయి. కిందటి సంవత్సరం నాకు ఒక నాడు హఠాత్తుగా ఒక పరమ సత్యం బోధపడింది. సీత మునుపటి సీత కాదని. నా పట్ల ఆమె ప్రవర్తన నాకు ఇబ్బందిగా ఉండేది. ఆ నాటినుంచి నా జాగ్రత్తలో నేనుండే వాణ్ణి. సీతకి చనువివ్వడం

# శిశిరంలో వసంతం

మానేసేను. సాధ్యమైనంత వరకూ ఆమెను తప్పించుకుని తిరిగేవాణ్ణి. ఒకనాడు మాటగా అడిగేను "సీతా! నీ ఇంటికి ఎప్పుడు వెళతావ్?" అని. "అదేమిటి బావా అలా అడుగుతావ్? ఇదే నా ఇల్లు!" అంది తొణక్కుండా. ఈ పిచ్చి ముదరకముందే ఈమెనిక్కడనుంచి పంపించేస్తే మంచిదని నా మామ గారికి ఉత్తరం రాసేను. అతనొచ్చేడు. ఊరిపోసుకుని చస్తాను కాని మిమ్మల్నొదిలి వెళ్ళనంది. ఆయన మళ్ళీ వెళ్ళిపోయాడు. ఇప్పుడేం చెయ్యడం? జీవితం ఒక మహా సాగరం అన్నారు. ఆ సాగరంలో ఒక పెను తుఫాను వచ్చి నన్ను ఛిన్నాభిన్నం చేసి తీరానికి విసిరేసింది. అక్కడనే నిమ్మసిల్లి యిసకలో పడి ఉంటే జీర్ణమైనాటి కెరటాలు ఒకదానివెంబొకటి ముంచుకుంటూ నన్ను మళ్ళీ లోనికి లాగేయి. ఈ మారు మునగడమూ, తేలడమూ అని కర్తవ్యం తెలియక కొట్టుకుంటున్న నా దృష్టికి ఒక చక్కని పడవ కనిపించింది. అందులో నువ్వున్నావ్. అప్పుడు నాకీ ఆలోచన తట్టింది. ఆ పడవలోకి మెల్లిగా ఎక్కి నిన్ని సముద్రంలో తోసేద్దామని. అందుకే నిన్ను అలహాబాదు పిలిపించేను. ఏవిధంగా పోల్చినా నీతో నేను పోటీపడలేనుగదా? నిన్ను చూసేక ఆమె తప్పక తన తెలివి తక్కువ ఆలోచనలకి స్వస్తి చెప్పి నిన్ను వరిస్తుందని గట్టిగా నమ్మేను. కాని ఇలా అవుతుందని నేను కలలోనైనా వూహించలేదు. శరదృతువునిదాటి శిశిరంలో అడుగు పెట్టేను నేను. తాను వసంతంలో ఉందామె. మా ఇద్దరికీ పొత్తెక్కడ? నాకు తెలుసు అక్క సౌఖ్యంకోసం తన జీవితాన్ని బలి చెయ్యడానికి సిద్ధపడింది సీత ఈ త్యాగమయిని నే నెలా స్వీకరించగలను? నన్నిప్పుడేంచెయ్యమంటావ్ చెప్పు?"

జంక్షన్ ఇంజను కూతకి ఇద్దరం తుళ్ళిపడ్డాం. ప్లాటుఫారం మీదకి రైలుబండీ ఎప్పుడొచ్చిందో మేము గమనించనేలేదు. ఇంజనుకి మా బోగిని తగిలించి రైలుబండీ చివరకి తీసుకొనివెళ్ళి అక్కడ అటాచ్ చేసేరు.

"సరే. ఇక దిగండి" అన్నాను.

"దిగుతాను. నువ్వొక్కసారి మనస్ఫూర్తిగా నన్ను క్షమించేనూ అను" అన్నాడు బొంగురుపోయిన గొంతుకతో.

"ఇందులో మిమ్మల్ని క్షమించేందుకేముంది! ఎన్నియుగాలైనా పురుషుడు స్త్రీని ఏనాటికీ అర్థం చేసుకోలేడు. అది భగవంతుడు మన కిచ్చిన శాపం. వాళ్ళలోంచి జన్మించి వాళ్ళకి విలువ కడతాం అనుకోవడం మన తెలివి తక్కువ. అంతే."

గార్డు ఈల వూదేడు. ఆకుపచ్చ లాంతరు ఎవరో చూపిస్తున్నారు. సత్యమూర్తి దిగిపోయేడు! ఇంజను ఆయాసపడుతూ రైలుబండిని ముందుకు లాగడం ప్రారంభించింది.

"అన్నట్లు మర్చిపోయేను. సీత నీకు దీన్నిమ్మంది" అని కిటికీలోంచి ఒక పొడుగాటి అట్టపెట్టె నాకు అందించేడు. బండి ప్లాటుఫారం వదులుతుంటే ఆ పెట్టె విప్పేను. లోపల ఎర్రని కుషన్‌లో ఆమె కొన్న నెక్లెస్ ఉంది. నెక్లెస్‌కి తగిలించిన ఒక కాగితం మీద "ప్రేమతో నీ సీత" అని ముత్యాల్లాంటి అక్షరాలతో రాసి ఉంది. ★

# అయిదు రెళ్లు

38 వ పేజీ తరువాయి

గీతకు ఏం చేయటానికీ తోచలేదు. ఇంతట్లో మనస్సుకేదో తట్టింది. చటాలున మోహన్ చేతిలోని పేపరు తీసుకుని తేదీ ఎంతో చూసింది. గీత స్థిమితపడింది.

"ఇది ఏప్రిల్ ఇరవయ్యోతేదీ పేపరు .... మీరు కంగారుపడటం అనవసరం...."

మోహన్ అయోమయంగా చూశాడు.

"సినీరథం ఎప్పుడు విడుదలయిందో చెప్పండి!" అనడిగింది గీత మోహన్ని మరికొంత తికమక పెడుతూ.

"ఏప్రిల్ ఫస్టున .... ఆమాటకొస్తే ఏప్రిల్ సంచిక మార్చి ఆఖరులోనే విడుదలైంది ...." అన్నాడు.

గీత కళ్ళు వింతగా మెరిశాయి.

"మరి చూశారా? ఇది ఇరవయ్యోతేదీ పేపరు.... మీ నాన్నగారు సినీరథం చూసినా ఉండరు. చూస్తే మీ బొమ్మ పోల్చుకున్నా ఉండరు. మీరు ఊరికే గాభరాపడకండి...."

మోహన్ కాస్త స్థిమితంగా ఆలోచించుకున్నాడు. గుడివాడంటే పేపర్లు, మేగజైన్లు వెళ్ళని అడవిప్రాంతమేం కాదు. తను ముఖానికి మన్నుగా రంగు పూసుకుని, నొక్కు నొక్కుల జుట్టు పెట్టించుకుని, బొమ్మలషర్టు వేసుకుని ఫోటో తీయించుకున్నాడయ్యె! నాన్నేం గుర్తుపట్టగలడు? వంకీల్లేని పొడా జుట్టు, తెల్లని షర్టు, నిగనిగలాడని ముఖం .... నాన్నకు తనో మరోలా గుర్తుకురాడు .... సినీరథంలో ఫోటో వేయించుకున్నందుకు ఇప్పుడు 'అయ్యో!' అనుకోవాల్సిన పనిలేదు. అమ్మయ్య!

మోహన్ గీతకు కృతజ్ఞత చెప్పుకున్నాడు.

"నా బెంగ కాస్తా తీర్చారు! మీ ఋణం జన్మజన్మాలకు తీర్చుకోలేను."

గీత సిగ్గుపడింది.

"ఊరుకోండి! ఇందులో నేను చేసిందేముంది?" అంటూ గీత కాఫీ తయారుచేసి తీసుకురావటానికి లోపలి కెళ్ళింది. కాస్సేపట్లో కాఫీతో తిరిగొచ్చింది.

(సశేషం)

తరు అందుకని! ఇప్పుడాయన నా ఆరా తీయాలని ఫోటో వేయించారు. . . ."

గీత మాట్లాడకుండా ఆ ఒక్క పేపరూ అట్టే పెట్టి మిగతావన్నీ తొందరగా తూయించి డబ్బులు తీసుకుని వాడిని పంపేసింది.

వాడు వెళ్ళాక "చిన్నప్పటి ఫోటో వేయిస్తే మిమ్మల్నెవరు పోల్చుకుంటారు?" అనడిగింది గీత అయోమయంగా చూస్తూ.

"ఇప్పటి ఫోటో లేవీ ఆయన దగ్గర లేవు లెండి. అన్నీ నాతోనే మూట గట్టుకొచ్చాను. ఇదొక్కటే ఆయన దగ్గరుంది. . . ." అని వివరించి చెప్పాడు మోహన్.

గీత మోహన్‌కు ధైర్యం చెప్పింది.

"ఈ ఫోటో చూసి ఎవరూ మిమ్మల్ని అనుమానించరు. బెంగపెట్టుకోకండి."

అయినా మోహన్‌కు అధైర్యం తగ్గలేదు.

"అది కాదండి నా బెంగ! మానాన్న సినీ రథం చూస్తే ?.... కోరి తద్దినం తెచ్చుకొన్నట్టయింది. నటుణ్ని కావాలనే ఉబలాటంలో ఇంటి నుండి చెప్పకుండా ఉడాయించిన సంగతి మర్చిపోయాను. లేకపోతే ఫోటో వేయించుకునే వాడినే కాదు...." అన్నాడు అతిదైన్యంగా.

## భారీయెత్తున దేశరక్షణకు
## ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి అవసరం

# వర్ధమాన నటి విజయ పరిచయం!

"నమస్కారం! రండి, రండి" అంది నవ్వుతూ విజయ. ఆ పలకరింపులో ఎంతో అణకువ, వినమ్రత కనిపించాయి.

"ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకులకు మిమ్మల్ని పరిచయం చెయ్యాలని వచ్చాను"

"ఇంటింటికీ అభిమాన పాత్రమైన ఆంధ్ర సచిత్ర వార పత్రికలో నాకు ఇలాంటి అవకాశం వచ్చినందుకు చాలా సంతోషమండీ!...... పత్రిక అంటే నాకు అభిమానం. ఏం కావాలో అడగండి, చెబుతాను."

"మీరెక్కడ జన్మించారు?"

## కేరళవాసి

"కేరళలోని త్రిచూర్‌లో. నా తల్లిదండ్రులు కల్యాణి, రామచంద్రన్‌లు. 1947 ఫిబ్రవరి 18న పుట్టాను."

"విద్యాభ్యాసం ఎక్కడ చేశారు?"

విజయనవ్వి—"నేనేం చదివాననుకుంటున్నారు?" అంది.

"నాకు ఎలా తెలుస్తుంది, మీరు చదువుకున్నదేమిటో?"

"మీరే కాదు, చాలామంది అనుకున్నారు నేనేదో చదువుకున్నానని.....అక్కడేఉంది తమాషా! నేనేం చదువుకోలేదు. అయినా తెలుగు, తమిళం, మళయాళం, ఇంగ్లీషు భాషలు వచ్చును. ఇవి స్వయం కృషివల్ల నేర్చుకున్నవి, అనుభవంవల్ల తెలుసుకున్నవి."

"ఏం చదువుకోకుండా మీ అంతట మీరు నాలుగు భాషల్లో ప్రవేశం కల్పించుకోగలగడం నిజంగా ప్రశంసనీయం......మరి నృత్యం ఎవరి దగ్గర నేర్చుకున్నారు?"

"నృత్యం ప్రసక్తి వచ్చింది గనుక మా నాన్నగార్ని గురించి చెప్పాలి ముందు. ఆయనకు నాటకాలలో విశేషమైన అనుభవం ఉండడంవల్ల నాకు ఇంట్లోనే ఒక క్రమంలో నటనలో శిక్షణ ఇచ్చి నన్నొక నటిగా తయారు చేశారు......ఒక్కొ తారకు ఇంట్లోవాళ్ళు ఎన్నో ఆటంకాలు కలిగిస్తారు. మా నాన్నగారు స్వయంగా పెద్ద నటులు కావడం చేతనా పట్ల శ్రద్ధ తీసుకుని, నాటకాల్లో నటించేందుకు నన్ను ప్రోత్సహించారు. నాకు డాన్స్



"తెలుగు పాఠకులకు పరిచయం చేస్తున్నందుకు నాకెంతో సంతోషంగావుంది"

చిలిపి చూపులు

(పేర్చింది కూడా నాన్నగారే!"

## 'కల్పగం'తో ఆరంభం

"ఆ తర్వాతనే చిత్రసీమలో ప్రవేశించారా?"

"అవును. నా మొదటి చిత్రం "కల్పగం". కె. ఎస్. గోపాలకృష్ణన్ ఆ చిత్రానికి దర్శకులు. ఆయన నన్ను చూసి, ఆ పాత్రకు సరిపోగలనని చెప్పి—ఆ వేషం నాకు ఇచ్చారు. ప్రేక్షకులు—ముఖ్యంగా స్త్రీలు సానుభూతిని, అభిమానం నాపైన విశేషంగా చూపారు. ఎన్నో ప్రశంసా పత్రాలు వచ్చాయి కూడా. ఆనాడు నేను పొందిన ఆనందం మరచిపోలేను. ఏనాటికీ అది నా హృదయంలో నిలిచే ఉంటుంది."

"ఇప్పుడు ఎన్. ఏ. టి. వారి 'శ్రీకృష్ణ పాండవీయం'లో, ......రుక్మిణిగా నటిస్తున్నాను. తెలుగులో ఇదే నాకు మొదటి చిత్రం. ఈ చిత్రం ద్వారా ఆంధ్ర ప్రజల అభిమానాలను కూడా చూరగొనాలని ఆశిస్తున్నాను. ఏ నటుడూ, నటీ

# విజయ పరిచయం

భాషా భేదం పాటించకుండా— అన్ని భాషలవారినీ గౌరవంగా చూడగలగాలి. అలాంటివాళ్లే నిజమైన కళాకారులు. అపుడే అందరి మధ్యా ఐకమత్యం రూపొంది ఆహ్లాదకరమైన వాతావరణం ఏర్పడుతుంది."

## 'కళావర్ధిని'

"మీరేదో నాటక సంస్థను నడిపిస్తున్నట్లు వినడం జరిగింది......?"

"అవునండి. దాని పేరు 'కళావర్ధిని'. ఈ సంస్థ ద్వారా వివిధ నాటకాలను పలు ప్రాంతాల్లో ప్రదర్శిస్తున్నాము. ఈ వృత్తిలో ఉండేవారిని ఆదరించి అనేకమంది కొత్త నటీ, నటులను తయారుచేసి వెండి తెరకు సమర్పించాలన్నే ఆశయం నాకు ఉన్నది."

"కళావర్ధిని ద్వారా మీరు ప్రజలకు అందించే



ఎప్పుడూ ప్రశాంతంగా కనిపించే విజయకు తమిళచిత్రరంగంలో మంచిస్థానం వున్నది.



తమిళ బేబినటితో విజయ

సహాకారం ఏదైనా ఉందా?"

"ఉంది. ఈ సంస్థను ఇంకా అభివృద్ధిచేసి, మంచి నాటకాలు ప్రదర్శించి, బీద పిల్లలను చదివించడం, ఆసుపత్రుల నిర్వహణకు తోడ్పడం— మొదలైన కార్యాలను చేసే ఉద్దేశ్యం ఉంది."

ముగ్ధత్వమూ, అమాయకత్వమూ నిండిన విజయ మోములో ఆ క్షణాన ఉదాత్త భావం వెల్లివిరిసింది.

"ఇంత చిన్న వయసులో ఇలాంటి విశాల భావాలు ఏర్పరచుకోడం హర్షణీయం.....తీరిక సమయాల్లో ఇంకా మీరేం చేస్తుంటారు?"

"పత్రికలు, పుస్తకాలు చదువుతాను. నాకు ఇద్దరు చెల్లెళ్ళు ఉన్నారు. వాళ్ళకి డాన్స్ నేర్పుతాను. వాళ్ళను కూడ కళాకారులుగా చెయ్యాలని నా ఆశ."

"ఈమధ్య అవుట్‌డోర్ షూటింగ్‌కి యు.పి. వెళ్ళారటకదూ?"

"అవునండీ, ప్రసాద్ ప్రొడక్షన్స్‌వారి కలర్ చిత్రంలో నటిస్తున్నాను. దానికోసం నైనిటాల్, అల్మోడా మొదలైన ప్రాంతాలకు వెళ్ళాను. అక్కడి విశేషాలు పాఠకులకు చెప్పాలని ఉన్నది. ప్రస్తుతం టైమ్ లేదు. వీలు కలిగినప్పుడు సంపాదకులు అనుమతిస్తే—ఆంధ్ర సచిత్ర వార పత్రిక ద్వారా మరోసారి ముచ్చటిస్తాను."

"మీరేదో షూటింగ్‌కి సిద్ధమవుతున్నట్లున్నారు. నేనిక వెడతాను."

"నమస్కారం! వెళ్ళిరండి!" అంటూ చిరునవ్వుతో వీడ్కోలు చెప్పింది వర్ధమానతార కె. ఆర్. విజయ.

వ్యాసం:- మోహన్ కుమార్ ★

ఫోటోలు : ప్రభాకర్



జగపతివారి 'అంతస్తులు' ప్రారంభోత్సవం హైదరాబాదులో జరిగినసందర్భంలో తమిళనటుడు శ్రీజెమినీ గణేశ్ 'క్లాప్'కొట్టారు. నాగేశ్వరరావు, కృష్ణకుమారిగారలనుకూడా ఫోటోలో చూడవచ్చును.



'తోటలోపిల్ల-కోటలో రాణి' చిత్రంలో కాంతారావు, రాజశ్రీ.

# సినిమా వార్తలు

## విఠలాచార్య దర్శకత్వంలో ...

"నేను బ్రైట్ బ్రైట్‌గా ఉండాలి కదండీ!" అన్నది ముద్దు ముద్దుగా జమున.

కళ్ళద్దాలలోంచి స్క్రిప్ట్‌లోకి దీర్ఘంగా చూస్తున్న దర్శకులు విఠలాచార్య తల ఎత్తకుండానే "యాక్షన్ బ్రైట్‌గా ఉండాలమ్మా!" అన్నారు.

"జోరు జోరుహా, ఝరు ఝరుహా

ఝణక్ ఝణక్ ఝుంబ— అయ్యయ్యయ్యా..."

ఈ పాట జమునపై చిత్రీకరణ జరుపుతున్నారు. మధ్యలో మ్యూజిక్ బిట్ టేక్‌కి సిద్ధమవుతూ జమున— అద్దంలో చూస్తూ మేకప్ సరిదిద్దుకుంటూ పై మాటలు అన్నది— సహకార దర్శకునితో.

అందుకు ఓ మాట అదనంగా జోడించి జోక్ చేశారు విఠలాచార్య. జమున కలకల నవ్వింది. నవ్వినపుడు ఆమె పలువరుస తెల్లగా మెరిసింది వెన్నెల విరిసినట్టు.

## 'కొడైకెనాల్'

అవుట్‌డోర్‌కి మనం ఊటీకన్నా కొడైకెనాల్ వెళ్తే బావుంటుందేమో కదండీ!" అన్నారు నిర్మాత డి. వి. ఎస్. రాజు.

"ఆ" అన్నారు విఠలాచార్య. "కొడైకెనాల్ లోనే వెదర్ కూడ బావుంటుంది. అదిగాక ఆ క్లైమాక్స్ ఎఫెక్ట్ అది అక్కడే చక్కగా ఉంటుంది.'

"అబ్బ, ఊటీలో ఏం చలి అండీ! మేం 'హవ్‌రాహ్' కి వెళ్ళినపుడు ఒకటే చలి. ఉండలేక పోయామనుకోండి" అప్పటి స్మృతిని తలపుకు తెచ్చుకుంటూ అన్నారు నిప్పాణి శ్రీనివాసరావు (జమున తండ్రి.)

"ఎప్పుడైనా అనుకూలంగా ఉండేది కొడైకెనాలే!" అన్నారు డి. వి. ఎస్. రాజు.

"ఏదైనా ఈ ముసురు తెరిపిస్తేగాని, అవుట్‌డోర్స్‌కి వెళ్ళి చేసేదేం ఉండదు" అన్నారు విఠలాచార్య. ఆయన ఈ మాటలు అంటున్నప్పుడు వాతావరణం తుఫానును సూచిస్తున్నది.

## మంగమ్మశపథం

ఈ సందడి అంతా డి. వి. యస్. ప్రొడక్షన్స్ వారి "మంగమ్మ శపథం" చిత్రం సెట్స్ మీదది. సత్యా స్టూడియోలో నిర్మించబడుతున్న ఈ చిత్రం విఠలాచార్య దర్శకత్వంలో నిర్విరామంగా షూటింగ్ జరుపుకుంటున్నది.

మూడు చిత్రాలను ఏకకాలంలో తయారు చేస్తున్నారు విఠలాచార్య. తన దర్శకత్వంలో నిర్మించబడే చిత్రాలకు ఒక వరవడి ఏర్పరచుకుంటారు. ఆయన ఆ ప్రకారం అన్నీ నిర్ణయించుకుని షూటింగుకు ఉపక్రమిస్తారు. అందువల్లనే ఆయన చిత్రాలు అనుకున్న సమయానికి విడుదలవడం జరుగుతూ ఉంటుంది.

*   *   *

"ఆ పొట్లం నాది. ఇచ్చెయ్!" అన్నాడు విజయ్.

"ఇస్తాలే, ఇలారా!" అంటూ పిలిచాడు రాజా.

విజయ్ దగ్గరికి వచ్చాడు. ఆ పసివాణ్ణి చూడగానే ఏదో తెలియని పాశం రాజాను కదిలే

యమునలూ, సుశీల ఘంటసాల యుగళగీతం ఆదినే పలకరిస్తాయి. "రాదనుకున్నావేమో" అని మొదలై "చక్కని కన్నెవు ముక్కున కోపం ఏకేలా" అని నాయకుడు ప్రశ్నిస్తే నాయకి యుగాలుగా స్త్రీలు అడుగుతున్న ప్రశ్ననే "వలచి వచ్చినే చులకనైతిగా ఈ వేళ" అని వార్చి అంటుంది. శ్రీశ్రీ సాహిత్యం ముత్యాల ప్రోవైతే జంట దర్శకుల సంగీతం చక్కని సంగతుల తేవ. సుశీల కంఠం మందారవరాలమైతే ఘంటసాలది మలయానిల ఖేల. వాద్యగోష్ఠి ఆమని యామినీ లీల. ప్రేమికులకీ పాటొక మన్మథ డోల.

రెండవ ప్రక్కనకూడా ప్రేమ గీతమే. మొదటిది ఉత్తమ నాయకీ నాయకులదైతే రెండవది విదూషకుల జంటది. వరుసలో జానపదుల జానుతనం, మాటలో కొసరాజు జాణతనం, పాడటంలో జానకి మెత్తదనం, మాధవపెద్ది కొంటెతనం పాటకంతటికి ఒక కొత్తదనం చేకూరుస్తున్నాయి. పాపం "గుబులు గుబులుగా గుండె దిగులుగా" అనేకి ఉంటే అతనికి ఎలా ఉంటుంది.? తెలుసుకోవాలంటే వెండితెరదాకా వెళ్లనక్కర్లేదు. ఆ చిత్రం విడుదలయేవరకు రికార్డు వింటేచాలు.

* * *

దాగుడుమూతలు ఎస్. 69816.

సర్వసాధారణంగా ఒక చిత్రంలో అన్నిటికీ తీసికట్టుగా ఉన్న పాటను తీస్తే అది కామెడీ గీతమనే ప్రారబ్ధం తెలుగు చిత్రాలలో ఉండేది. ఇటీవల ఆ తలవంపు తప్పుతున్నది. ఈ కోవకు చెందిన వాటిలో "డివ్వి డివ్వి డివ్విట్టం" ఒకటి. ఎక్కడా అశ్లీలార్థం వెతకి చూద్దామన్నాలేదు. "డీ డిక్కుంది అదృష్టం గెట్టిక్కింది మన కష్టం" అని అమ్మాయంటే "డివ్వి డివ్వి డివ్విట్టం నువ్వంటేనా కిష్టం" అని అబ్బాయి అంటాడు. అమ్మాయి ఎవరు ? "అంచెలంచెలు," "కోడలా కోడలా", "పిచ్చైన పడుచున్నదోయి" స్వర్ణలత. అయితే అబ్బాయి ? "ఈ వేళ నునం వ్రాసుకున్నా ప్రేమపత్రమూ", "శాంతవంటి పిల్ల లేదోయి" పిఠాపురం. పాట వింటుంటే బుక్కా వసంతాల చల్లుకున్నట్లు, ఎంపకాల తలంబ్రాలు పోసుకున్నట్లు ఉంటుంది. దీనికి కారణం ఊరించే మహాదేవన్ వరుస. ఆరుద్ర రచన. హుషారుకి మారు పేరుగా ఉన్నది వీరిద్దరి సృష్టి.

"గోరొంక గూటికే" నాకేమీ నచ్చలేదంటే చాలామంది పాఠకులు నాపై కోపగిస్తారనుకుంటాను. ఎందుకోగాని ఈ రెండు పాటల్లో నాకు ఏమాత్రం ఆకర్షణ కనపడలేదు. వరసలో కొత్తదనం కొంచమే. అదీ రెండుమార్లు వెంట వెంటనే వినినంతనే మాయమయింది. ఈ రికార్డులో ఉన్నది ఘంటసాల పాడినది. ఈ కారుమబ్బుకి ఒకే ఒక వెలతూరు అంచు. దాశరథి రచనలో కొన్ని తళుకులు.

"నా మనసైనపూలు నీకు మంచి కథలు చెప్పునే"
"పిలవలేని కన్ను పిలుపునిస్తున్నాయి
పైటచెంగు రెపరెపలు పదపద తెమ్మన్నాయి"

ఆయన వ్రాసి చూస్తుంటే ఈ మెరుపులు చాలనిపిస్తున్నది.



మంచిమనిషిలో జమున.

వివాహబంధం ఎస్. 69804

"వివాహబంధం" ఉన్నవి ముచ్చటగా మూడే పాటలు. మూడవది "నగుమోము"నే త్యాగరాజ కీర్తన ఇవన్నీ వారాని కొకటి పరిచయం చేస్తాను. ఈవారం కానుక :

"విన్నావా
మనసులోన దాగివున్న మధుర గీతి
తొలి చూపులు నా మదిలో తలుపులు తెరచెనే
పెదవులపై చిరునవ్వులు విరబూచెనే
తలపులన్ని వేణువులై పిలువసాగెనే
హృదయమే యమునా నదియై కదలసాగెనే
అందరాని చందమామ ముందు నిలిచెనే
అణువణువున వెన్నెలలే ఆరబోసెనే
వలపులు విరజాజులుగా పరిమళించెనే
జగమే బృందావనియై సొగసులొలికెనే"

రచన సి.నారాయణరెడ్డి. ఇంత చక్కగా ఉన్నందుకేకాదు పాటంతా ఉదహరించినది. ఆనాటి జయదేవ నారాయణతీర్థులనుంచి ఈనాటి సి. నారాయణరెడ్డివరకూ శృంగారములో అందాన్ని చూపించాలంటే ఆనందాన్ని గుప్పించాలంటే రాధామాధవకేళీ వర్ణనలే శరణ్యం. వేణువులు, యమునానది, వెన్నెల, విరజాజుల్లు, బృందావనం — పాటకి అందం ఆనంద బాలుని స్పర్శవలనే కదా !

పై పాటను మధురముగా, లలితముగా పాడినది భానుమతి. ఆ కంఠంలో అనురాగం, ప్రతీక్ష, అహంకారం, అనునయం, ప్రణయం మిళితమైనట్లు మరింకే స్వరంలోనూ కానరాదు. ఓ మారు ఆ పాటను వినండి. నా మాటను కాదనగలరేమో చూడండి.

రెండవ ప్రక్క పాట సాధారణమైనది. "కోవెల తలుపులు మూసినంతనే దైవము దూరమై పోవునా" అన్న ప్రశ్న ఆ పాటకు సాహిత్య సీమలో ప్రవేశం కలిగించింది. వరుస కూడా పెద్దగా చెప్పుకోదగినదేమీకాదు. పై రెండు పాటలూ సి. నారాయణరెడ్డి రచన. ఎం.బి.శ్రీనివాస్ సంగీతం. భానుమతి సంగీత పర్యవేక్షణ.

* * *

"చిటారు కొమ్మన మిఠాయి పొట్లం
చేతి కందదేం గురుడా
పాటంజూసి పడుచుంజూసి
పంచర కొమ్మను గురుడా"

కన్యాశుల్కం— మల్లాది— ఘంటసాల ఘంటసాల.

వి. ఎ. కె. రంగారావు ★



'జహానార'లో మాలాసిన్హా, భరత్ భూషణ్.

చిత్ర సమీక్ష

# చక్కని ప్రేమగాథ 'జహానార'

ప్రియుణ్ణి కలవబోనని, తండ్రికి అయిష్టమైన పనిని చేయనని తల్లికి అవసానదశలో ఇచ్చిన మాట ఒకవైపు ఆమెను క్రుంగదీస్తున్నా, హృదయేశ్వరుణ్ణి కలవాలని, భావగీతిక చెప్పుకోవాలని ఆమె హృదయం మరోవైపు విశృంఖలంగా పరవళ్ళు త్రొక్కుతుంది. అనుకోకుండా దూరమయిన ప్రియురాలిని చూచి, అతనూ తల్లడిల్లిపోతూ ఉంటాడు.

'జహన్ ఆరా' షాజహాను చక్రవర్తి కూతురు. బాల్య స్నేహితుడు, కవి—గాయకుడు అయిన మీర్జాను చూచి మది పులకించి, మోహంలో పడుతుంది. తండ్రి ఏమీ చెప్పకపోయినా, ఈ ఇరువురి ప్రేమకు అతను సుముఖుడు కాడు. 'ప్రేమించే హక్కు ప్రభువుకేగాని, పేదవానికి లేదా' అన్న మీర్జా ప్రశ్న విన్న షాజహాను ఆపాదమస్తకం వణకి, చివరకు అతనికి మరణదండన విధిస్తాడు. కొన్ని వారాలు, నెలలు గడుస్తుండగా మీర్జా 'మరణదండన' కార్యరూపం ధరించేలోగా, షాజహాను మీదికి పెద్ద కొడుకైన ఔరంగజేబు దండయాత్ర చేయించి, రాజ్యాన్ని చేజిక్కించుకొంటాడు. ప్రియుని ఆరాధన ఒకవైపు బాధ పెడుతున్నా, 'జహన్ ఆరా' మాత్రం రాజ్యభ్రష్టుడైన తండ్రిని సంరక్షిస్తూ, ఏడు సంవత్సరాల పాటు జీవితాన్ని గడిపి, చివరకు ప్రియునికి ఒక్క మారు తన ముఖాన్ని చూపి చనిపోతుంది.

చరిత్రాత్మకమైన ఈ కథ షాజహాను, ముంతాజ్‌ల ప్రేమ గాథంతటి సుప్రసిద్ధమైనది కాకపోయినా, మహమ్మదీయ చరిత్రలో ముఖ్యమైనదే. చరిత్రను పెద్ద మార్పులు లేకుండా తెరమీదకు ఎక్కించటం ఇందలి విశేషం.

''లైట్ అండ్ షేడ్'' వారు నిర్మించిన ఈ చిత్రం 'ఈస్ట్మన్ కలర్' లో తయారైంది. చక్కని రంగులతోడు ప్రతిభావంతమైన ఛాయాగ్రహణం కూడా ప్రేక్షకులను ఆకర్షిస్తుంది.

పేరుకు ప్రేమగాథే అయినా, ఇందులో నాయికా నాయకులు చాలావరకు విరహబాధే అనుభవిస్తారు. 'డ్యూయెట్ల'కంటె 'సోలో' పాటలే ఎక్కువ. పైగా హిందీ చిత్రంలో ఉర్దూ పదజాలాన్ని ఎక్కువగా ఉపయోగించటంతో నిర్మాతలు ఆశించిన మహమ్మదీయ వాతావరణం ఉట్టిపడినా, సహజత్వం లోపించింది. చిన్న కథను తీసుకొని సుదీర్ఘంగా తయారు చేయటంచేత అక్కడక్కడ విసుగుపుట్టే అవకాశం ఉంది.

'జహన్ ఆరా'గా మాలాసిన్హా చక్కగా సరిపోయింది. విరహిణిగా ఆమె చూపిన నటన శ్లాఘనీయమైనదే. ప్రియుడు మీర్జాగా నటించిన భరత్ భూషణ్ రసికునిగాకంటె, ఆశయం ఫలించని కవి, గాయకుడుగా బావున్నాడు. ప్రేమ సన్నివేశాలలో కథా నాయకుడు అసమర్థుడుగా కనిపిస్తాడు.

విలువైన సెట్టింగులు తప్పకుండా కన్నుల పండువుగా ఉన్నాయి. ఔట్‌డోర్ దృశ్యాల చిత్రీకరణ బావుంది. సంగీతం కొన్నిచోట్ల పేలవంగా ఉన్నా, మరికొన్నిచోట్ల అనన్యసామాన్యంగా ఉంది. పాటలన్నింటిలో ఉర్దూ పదాలు, సంగీతం ఎక్కువ ఉండటం ఆధునికంగా లేకపోయినా, కొంతవరకు ఇవి ప్రాచీన సంగీతప్రియులకు నచ్చక పోవు. దర్శకత్వం రమ్యంగానే ఉంది.

చిత్రం చూచాక, ప్రేక్షకుడు బరువెక్కిన హృదయంతో ఇంటికి వెళ్తాడు.

ఆంధ్రలో శ్రీ రామా పిక్చర్సు వారు విడుదల చేస్తున్న ఈ చిత్రాన్ని యిటీవలనే మద్రాసులోని 'ఆనంద్' థియేటరులో పత్రికా విలేఖరులకు ప్రత్యేకంగా చూపారు. పాశిరాజు ప్రకాశం.★

## సినిమా వార్తలు

### 'ప్రేమించిచూడు'

మెజస్టిక్ స్టూడియో కొద్దికాలంనుంచి మూసి వేయబడి ఉన్నది. ఇటీవల మళ్లీ తెరిచారు. ఇప్పుడు ఏ. యల్. శ్రీనివాసన్‌గారి ఆధిపత్యంలోకి వచ్చి కొత్త రూపు సంతరించుకుంటున్నది. నవంబరు 9 నుంచి పద్మశ్రీవారి కొత్త చిత్రం ''ప్రేమించి చూడు'' పాటల రికార్డింగ్ కార్యక్రమం ఆరంభమైనది మెజస్టిక్‌లో.

ఈ చిత్రంలో నాగేశ్వరరావు, జగ్గయ్య, రేలంగి, చలం, రాజశ్రీ, కాంచన మొదలైనవారు పాల్గొంటారు. అవుట్‌డోర్ షూటింగ్‌తో ఈ చిత్ర నిర్మాణం ప్రారంభమవుతుంది. అందుకు తగిన సన్నాహాలు చేసుకుంటున్నారు. సంభాషణలు : ముళ్ళపూడి వెంకటరమణ, పాటలు ఇప్పటివరకూ ఆత్రేయ, సి. నారాయణరెడ్డి, ఆరుద్ర, ముళ్ళపూడి వెంకటరమణ వ్రాశారు. సంగీతం : వేణు. నృత్యాలు : తంగప్పన్, కెమెరా : పి. యల్. రాయ్, దర్శకుడు : పి. పుల్లయ్య, బి. ఏ., నిర్మాత : వి. వెంకటేశ్వర్లు బి. ఏ. ఈ చిత్రాన్ని సంపూర్ణ హాస్య రసభరితంగా రూపొందించాలని దర్శక నిర్మాతల సంకల్పం.

### వాసంతి ముందంజ

నటి వాసంతికి నటనతోపాటు చక్కని అభిరుచి కూడ ఉంది. తీరిక వేళల్లో తెలుగు, ఆంగ్ల సాహిత్యాలు చదువుతూ కూర్చుంటుంది. సెట్ మీద నటించబోయే సన్నివేశానికి ముందుగా ఇంటివద్ద రిహార్సల్ చేసుకుంటుంది. ఇటీవల విడుదలయిన ''వివాహబంధం'' చిత్రంలో చక్కగా నటించి ముందటి చిత్రాలకన్న మెరుగనిపించుకున్నది.

తనకు ఇచ్చిన పాత్రను నాలుగైదుసార్లు చదివి

లించి రచించుటలో దృక్పథం, సన్నివేశానికి గల ప్రాధాన్యత తెలుసుకుంటుంది. చదువుకున్నందు వల్ల ఆమెలో ఈ ప్రత్యేక దృష్టి అలవడింది.

వాసంతి చందూభాయ్ పటేల్ హిందీలో నిర్మించుతున్న ఈస్ట్‌మన్ కలర్ చిత్రం "కృష్ణలీల" లో రాధగా నటించేందుకు ఈమధ్య ఒప్పందం జరిగింది. హిందీ చిత్రాల్లో నటించడం ఆమెకు ఇదే ప్రథమం. సావిత్రి, జమున, సరోజాదేవి దక్షిణాది చిత్రాల్లో నటనలో అపూర్వమైన ప్రతిభ కనబరచి ఇదివరకే హిందీ చిత్రరంగంలో ప్రవేశించారు. ఇప్పుడు వాసంతి కూడ ఉత్తరాది వారి దృష్టిని ఆకర్షించడం ముదావహం.

## పల్నాటి వీరకథ

శ్రీ అనురాధావారి "పల్నాటి వీరకథ" చిత్ర నిర్మాణం త్వరితగతిని సాగుతున్నది. ఎన్. టి. రామారావు, కాంతారావు, హరనాథ్, బాలయ్య, గుమ్మడి, ముక్కామల, రాజనాల, మిక్కిలినేని, ప్రభాకరరెడ్డి, కె. వి. యస్. శర్మ, త్యాగరాజు, భానుమతి, జమున, వాసంతి, ఎల్. విజయలక్ష్మి నటిస్తున్నారు. స్క్రీన్‌ప్లే, సంభాషణలు : సదాశివబ్రహ్మం, పాటలు : మల్లాది రామకృష్ణశాస్త్రి, సముద్రాల (సీనియర్) ఆరుద్ర, సంగీతం : ఎస్. రాజేశ్వరరావు, కళ : గోఖలే, నృత్యాలు : వెంపటి సత్యం, కెమెరా : సి. నాగేశ్వరరావు, దర్శకుడు : జి. రామినీడు, నిర్మాతలు : టి. హనుమంతరావు డి. సూర్యనారాయణ, వై. లక్ష్మయ్య చౌదరి. భానుమతి పాడిన "జయశంభో శివశంకర" అనే పాటను రికార్డు చేసి, ఆమెపై చిత్రీకరించారు. మరికొన్ని పాటలు ఈ మాసంలో రికార్డు చేస్తారు.

## నాగేశ్వరరావు కొత్త చిత్రాలు

నాగేశ్వరరావు నటించేందుకు అంగీకరించిన చిత్రాలసంఖ్య ఈ సంవత్సరం ఎక్కువగానే కనిపిస్తున్నది. వాటిలో జగపతి పిక్చర్స్‌వారి "అంతస్తులు" చిత్రం అక్టోబరు చివరి వారం నుంచి షూటింగు ప్రారంభించారు. ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ చిత్రం, పద్మశ్రీవారి "ప్రేమించి చూడు" చిత్రాల షూటింగులు డిసెంబరులో మొదలవుతాయి. మిగిలినవి జనవరి నుంచి ప్రారంభమవుతవి.

## సురేష్ ప్రొడక్షన్స్

సురేష్ ప్రొడక్షన్స్‌వారు "శ్రీకృష్ణ తులాభారం" చిత్రం నిర్మించబోతున్నారు. ఎన్. టి. రామారావు—కృష్ణుడు, ఎస్. వి. రంగారావు—ఇంద్రుడు, కాంతారావు—నారదుడు, రుక్మిణి—అంజలీదేవి, సత్యభామ—జమున, రంభగా ఎల్. విజయలక్ష్మి ఇంతవరకు ఎన్నుకోబడినారు. మిగిలిన వారిని కూడా ఎన్నిక చేసి త్వరలో సెట్స్‌పైకి వెళతారు. ప్రస్తుతం పాటల రికార్డింగ్ జరుగుతున్నది. రచన : సముద్రాల (సీనియర్) సంగీతం: పెండ్యాల, దర్శకత్వం : తాపీ చాణక్య, నిర్మాత : డి. రామానాయుడు.

— మోహన్ కుమార్ ★



'సుమంగళి'లో జి. వరలక్ష్మి, నాగేశ్వరరావు.



'పాండవ వనవాసంలో' రామారావు, రాజసులోచన.

## సినిమా వార్తలు

"అప్పుసుపార్, అంతా బిజీ!" అంటూ ముందుకు సాగారు.

ఎం. జి. ఆర్., బి. సరోజాదేవి ముఖ్య భూమికలు ధరిస్తున్న "తాయిన్ మడియిల్" తమిళ చిత్రానికి ఆదుర్తి దర్శకత్వం వహిస్తున్నారు.

సెట్లో ఎం. ఆర్. రాధ, నంబియార్, నాగేష్, ప్రభృతులు ఉన్నారు. వారంతా సుబ్బారావుగారి కోసం కాచుకునున్నారు. అందుకే ఆయన అంత హడావిడిగా వెళ్ళిపోతున్నది!

## ప్రేమించి పెళ్ళిచేసుకో

గోకుల్ ఆర్ట్ థియేటర్స్‌వారు "ప్రేమించి పెళ్ళిచేసుకో!" చిత్రం నిర్మించుతున్నారు. ప్రఖ్యాత మరాఠీ నవల "మానిని" ఆధారంగా తయారవుతున్న యీ చిత్రంలో ఎన్. టి. రామారావు, గుమ్మడి, నాగయ్య, రేలంగి, నాగభూషణం, కృష్ణకుమారి, కొత్తనటి చంద్రకళ, గిరిజ, హేమలత, రాధాకుమారి, మాస్టర్ సాయి నటిస్తున్నారు. రచన : బొల్లిముంత శివరామకృష్ణ, సంగీతం : టి. వి. రాజు, ఎడిటింగ్ : జి. డి. జోషి, కళ : కె. నాగేశ్వరరావు, దర్శకత్వం : బి. ఎస్. నారాయణ, నిర్మాత : దోనేపూడి కృష్ణమూర్తి. ఇంతవరకు ఆరురీళ్ల చిత్రం పూర్తి అయింది.

## లలితా శివజ్యోతి కొత్త చిత్రం

లలితా శివజ్యోతి ఫిలింస్‌వారి ఈస్ట్‌మన్ కలర్ చిత్రం "రహస్యం"లో నాగేశ్వరరావు నాయకుడిగా నటిస్తారు. చాలాకాలం తర్వాత ఆయన జానపద చిత్రంలో వేషం మళ్లీ వేస్తున్నారు. యస్. వి. రంగారావు, కాంతారావు, గుమ్మడి, రమణారెడ్డి కూడ తారాగణంలో ఉన్నారు. నటీమణుల ఎన్నిక కాలేదు. సదాశివబ్రహ్మం సంభాషణలు, మల్లాది రామకృష్ణశాస్త్రి గీతాలు రూపొందిస్తున్నారు. సంగీతం : ఘంటసాల, కళ : టి. వి. ఎస్. శర్మ, దర్శకత్వం : వేదాంతం రాఘవయ్య. జనవరినుంచి సెట్స్‌మీదకువెళ్లే ఈ చిత్రం హైదరాబాద్‌లో నిర్మించబడుతుందని నిర్మాత ఏ. శంకరరెడ్డి తెలియజేశారు.

—మోహన్‌కుమార్ ★

## చికిత్సల అవధులు

7 వ పేజీ తరువాయి

కీళ్ళనొప్పుల స్వభావాలు కొంచెం భిన్నంగా ఉంటాయని శాస్త్రజ్ఞులు భావిస్తున్నారు. కాని, వివరాలు పూర్తిగా తెలిసేదాకా ఇదమిద్ధమని చెప్పటం కష్టం.

"ఇదంతా బాగానే ఉంది కాని 'చికిత్స పద్ధతులు' ఎంతదాకా పురోగమించాయి ? బాధనుంచి విముక్తి ఎప్పుడు ?" అని ప్రశ్నించవచ్చు మీరు.

దీనికి సమాధానం, జరుగుతున్న పరిశోధనని వివరించటమే ! బ్రిటన్‌లో మాత్రం 32 పరిశోధన ప్రణాళికలు జోరుగా నడుస్తున్నాయి. ఆహారానికీ, కీళ్ళనొప్పులకీ సంబంధం ఉందా లేదా అనే ప్రశ్నకి సమాధానంకోసం వెతుకుతున్నారు. వారి

ప్రాథమిక పరిస్థితులకీ కీళ్లనొప్పులకీ సంబంధం ఉందేమోనని ఆ రంగంలో తీవ్ర పరిశోధనలు జరుపుతున్నారు.

ఎలెక్ట్రాన్ మైక్రోస్కోపుతో జీవకణాల అంతర్భాగాలని వెతుకుతున్నారు. (ఈ యంత్రం కింద ఒక చిన్న ఫుల్‌స్టాప్ అరమైలు వెడల్పుగా కనిపించే అవకాశం ఉంది !) ఈ కాగితం కన్నా 500 రెట్లు సన్నగా ఉండే చర్మపు పొరలను తయారుచెయ్యటం తేలికపని కాదు ! వాటిని అనుశీలించటం అసలే తేలిక పనికాదు!!

అందుకే నేటి శాస్త్రజ్ఞులు చికిత్సల అవధులని సమీపిస్తున్నా రనవచ్చు.

"ఒక పరిశోధనవల్ల తెరుచుకునే తలుపు మరొక తలుపుకి దారితీస్తుంది" అన్నాడు, ఎంపయిర్ రుమాటిసమ్ కౌన్సిల్ అధ్యక్షుడు డాక్టర్ కోప్‌మాన్.

కీళ్లనొప్పులని చూసి నవ్వే కాలం పోయింది. ఎల్లలని ఎప్పుడు దాటినా ఏకాగ్రత మాత్రం అందరిలోనూ ఉందని ధైర్యంగా చెప్పవచ్చు. ★

# క్యారేజీల్లోకి

17 వ పేజీ తరువాయి

ఎవరికేనా పెడ్తే అది ఏమిటో చెప్పుకోలేరు.

## హాట్ పూరీ

పల్చగా వత్తి వేయించిన పూరీల గుండలో వేయించిన జీడిపప్పు, జీలకర్ర, కారం, చిన్నచిన్న బిస్కట్లు వేసి కాస్త నెయ్యి కరిగించి పోసి ఉండ కట్టాలి. ఇందులో ఇష్టమైతే కారం బదులు మిరియం పొడి వేసుకొంటే పిల్లలు రోజూ చెయ్యమంటారు.

## పాల పూరీ

పాలపూరీ అనేది అందరికీ తెలిసినదే ! కానీ ఇలా ఎప్పుడేనా చేశారా ?

కొబ్బరికాయ ఒకటి, పాలు పావుసేరు, బెల్లంపొడి, పచ్చ కర్పూరం, లేక ఏలకుపొడి.

గోధుమపిండితో పూరీలు వత్తి వేయించి ఉంచుకోవాలి. కొబ్బరి కోరు రుబ్బి, పాలువేసి కలిపి మరుగుతోంటే పంచదారో, బెల్లంపొడో వేసి కలిపి దింపేముందు జీడిపప్పు, ద్రాక్ష కిస్‌మిస్, పచ్చ కర్పూరం వెయ్యాలి. ఇందులో ఇష్టమైతే మిఠాయి రంగు వెయ్యవచ్చు. దీంట్లో పూరీలు వేసి అరగంట నానాక...

స్పూన్ పెట్టి క్యారేజీ కొంటే పిల్లలకి స్పూన్ పరే వెయ్యక్కరలేదు. వాళ్ళు పారవేస్తారనే భయమూ ఉండదు. చపాతీలు, పూరీలు క్యారేజీలో ముక్కలు చేసి పెట్టారంటే పిల్లలు సుళువుగా తింటారు. క్యారేజీలో ఏం పెట్టినా పై గిన్నెలో మజ్జిగా అన్నం పెడితే ఆరోగ్యంగా ఉంటారు. ఆరోగ్యానందాలతో తులతూగే పిల్లలే తల్లిదండ్రుల జీవితాలకి, ఇంటికీ, దేశానికీ కాంతి. అందుకే మన పెద్దలు "సంతోషమే సగం బలమన్నారు" ★


Edited, Printed and Published by S. Radhakrishna at the AndhraPatrika Press; 6 &7 Thambuchetty Street Madras-1. Phone; 29766 & 23713. Chief Editor S. Sambhu Prasad.



'తోటలో పిల్ల - కోటలో రాణి'లో రాజశ్రీ

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.




దేవిక